# పరిచయము



"యజ్ఞశ్రీ"

'యజ్ఞశ్రీ' పూర్తినామధేయము. (చిర్రావూరి యజ్ఞన్నశాస్త్రి బి.యె.) జననం: తూర్పుగోదావరి కాకినాడయందు. విద్యాభ్యాసము. పశ్చిమ గోదావరి ఏలూరునందు, కృష్ణాజిల్లా మచిలీపట్నం, తూర్పుగోదావరి కాకినాడయందు. సారస్వతాభిలాషులు, సంగీతమందును, చిత్రలేఖన మందును అనుభవము, ప్రావీణ్యము కలిగినవారు. సహృదయులు 1956 వ సంవత్సరమున శ్రీకాకుళమునందు జరిగిన చిత్రకళా ప్రదర్శనమందు ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీత్రివేదిగారిచే వారిచిత్రములకు రజితపతకము పొందిరి. నాటక రచనమందు, ఖండకావ్యములందు అనుభవము సంపాదించిరి. రంగస్థలమందు అనుభవము గలిగిన నటులు. వీరు ఇటీవలరచించిన నాటికలు "ప్రజారంజని, రక్తచందనము, ఈడూ-జోడు, మంచి - మర్యాదా" బహుప్రశంస పీయము. త్వరలో అచ్చు అవబోవుచున్నవి. వీరురచించిన గేయకావ్యములు.

"విరహిణి" "సాబూ కరుణామృతము" "పసిడిపలుకులు - పద్మదళాలు" కవిసామ్రాట్టులచేత బహువిధముల ప్రశంసింప బడి నవి. ఆంగ్లభాషా బోధకులుగా ప్రస్తుతము వారాయణగూడా "న్యూ సైన్సు కాలేజీ" హైదరాబాదు యందు పనిచేయుచున్నారు.

వీరి అభిమానులు ఆంగ్లభాషయందు:- జార్జిబెర్నార్డ్‌షా, షెక్స్పియరు, కౌట్స, షెల్లీ, బైరన్, బ్రేవింగు, థామసిహార్డి.

తెలుగు కవులలో:- శ్రీ విశ్వనాధ, రాయప్రోలు, కాటూరి, పింగళి, అడవి, కృష్ణశాస్త్రి, పిలకా గణపతిశాస్త్రి.

# 1

మానవ జీవితంలో మంచితనం ఉంటేనే పేరూ ప్రతిష్ఠ కలుగుతాయి. కాని జీవికాంతం వరకు ప్రపంచంలో అదే మాదిరిగా సంచరిస్తూ ఇతరులయొక్క మనఃప్రవృత్తులను అర్థము చేసుకోకుండా వుంటే దెబ్బ తింటారు. ప్రపంచ లౌకిక వ్యవహారములయందు ఎలాగు సంచరించడమో తెలిసినవారే బాగుపడడంతో ముగుస్తుంది వారి జీవితం. నా జీవితగాథను విశదంగా జ్ఞాపకమున్నంతవరకు హృదయవేదన చల్లారుతుందని మీకు విన్నవించుకోదలచాను. అదే నా మనస్సుకు తృప్తి నిస్తుందని గ్రహించి మీకు నా కథ చెప్పుకుంటున్నాను. ఇది నా అవసానదశ కాబట్టి నేను చిన్నతనంలో ఏవిధంగా పెరిగానో, పెద్దదాన్నయ్యాక చివరిదశ ఏవిధంగా మారిందో అదే చెప్పదలచాను. నా జీవితంలో పూర్వార్థాన్ని ప్రశాంత వాతావరణంలో, మల్లెపూల పందిళ్ళలో, సంజవెలుగుల నివాళుల్లో, అరుణ రాగాల్లో గడిపిన ధన్యజీవిని. అల్లారు ముద్దుగా పెరిగి అందరిచేత అందమైన దానివని బుద్ధిమంతురాలనని పేరు తెచ్చుకొన్నాను. తండ్రి ప్రేమకు సోదర ప్రేమకు పాత్రురాలనయ్యాను. ఎన్ని ఉంటే ఏమిలాభము చివరకు చెయ్యరాని తప్పుపనిచేసి తప్పటడుగు వేసాను. జీవితంలో మిగిలేది, నిలిచేది చేసిన పాప ఫలితాలేగదా! కన్నబిడ్డను కాకుండా పోయాను. విధిరాత ఇలాగ వుంటే తప్పించుకునే దెట్లా?

పది సంవత్సరములు దాటకుండానే అమ్మ ఈలోకాన్ని బాసిపోవడం, [illegible]న్నగారికి ఒక్కర్తెనే కుమార్తెనై, ముగ్గురన్నదమ్ములకు ముద్దుచెల్లెలిగా పెరిగాను. మా పెద్దన్నయ్య కేశవరావు, చిన్నన్నయ్య రాఘవరావు, బుజ్జి తమ్ముడు గోపీ. మా ఇల్లు అంతా తల్లి లేదన్న లోటేగాని, తండ్రిగారి ప్రేమ ఆదరణలో మేమందరము పెరిగి పెద్దవార మవుతున్నాము. తండ్రిగారు సిరిసంపదలతో పేరు ప్రఖ్యాతులు సంపాదించారు. నాన్నగారికి నేనెల్లప్పుడూ విడివడనిదానిగా అయ్యాను. మీకు నా కథ చెబితేగాని నాకుకూడా మనశ్శాంతి వుండదు. కథ విని చివరకు నేను చేసేది న్యాయమో అన్యాయమో మీరే ఆలోచించాలి. ఇంత బాధ్యత మీ మీదపెట్టినందుకు నన్ను తిట్టకుండా, నాలాంటి నిర్భాగ్యులకు మంచిపని చేయడానికి పూనుకోండి. భగవంతుడు మిమ్ములను అష్ట ఐశ్వర్యములతో స[illegible]గిస్తూ. మీ ఇంటికిలవచ్చి శాంతిని కలిగిస్తాడు. జీవితంలో కలిగే సుఖ, దుఃఖాలు అనేవి ఆకులమీంచి జారిన మంచు ముత్యాలు మాదిరిగా ధూళిలో కలసి కొన్ని ప్రవాహరూపంలో కొన్ని పరుగులిడుతూ, సుడిగుండాల్లో కలసి కొన్ని చివరికి ధూళిలో ఇంకిపోతాయి అదే జీవనస్రవంతిలో మునిగి తేలే జీవుల గాథ.

బంగారు కాంతిలో మెరిసిపోతున్నాయి మా ఇంట్లో కట్టిన పూసల తెరలు. తెల్లవారిందని కాబోలు పిట్టలు కుహూ కుహూ రావములు. గాలి తెరల చప్పుడులు, చెట్లపైని కెక్కలాడుస్తున్న పక్షిసంతతియొక్క రాగాలాపాలు నన్ను మేల్కొల్పాయి. ప్రక్కమీదనే పడుకుని కళ్ళు తెరచి గోడమీద ఎదు

రగా వున్న గోపాలుడు - రాధ కేలెండరుకేసి చూస్తున్నాను. ఎంతసేపటినుంచి చూస్తున్నాడో తెలియదు కాని 'అమ్మాజీ ఇంకా లేవేమమ్మా, కాఫీచల్లారిపోతోంది. సుందరమ్మ ఈ పూట ఆలస్యముగా వస్తాను బాబు అని చెప్పి కాఫీ కాచి యిచ్చి వెళ్ళింది. లే తల్లీ' అంటూ కమలాకరరావుగారు దగ్గరగా వచ్చారు. కల్యాణి నెమ్మదిగా ఆవలిస్తూ చిటికవేసి ముద్దుగా ప్రక్కమీాదనుంచి లేచి తండ్రి పాదాలకు నమస్కరించింది. చిరునవ్వులు ఒలకపోస్తూ దొడ్లోకి పరుగెత్తింది.

'పిచ్చిపిల్ల, అమాయకురాలు. దీన్ని ఒక బాబుచేతిలో ఎలాగ పెడుతానో తెలియదు. తల్లిలేనిపిల్ల అన్నలు అతి గారాబంగా పెంచుకుంటున్నారు. కానీ అంతా భగవంతుని దయమీాద ఆధారపడి వుంది మా సంసార పరిస్థితి.' అనుకుంటూ కమలాకరరావుగారు పీధిగదిలోకి వెళ్ళిపోయారు. దొడ్లో ముఖం కడుగుకొని కల్యాణి గెంతులేసుకుంటూ వంటింట్లోకి వెళ్ళి కుంపటిమీాద పెట్టిన కాఫీ దించుకు త్రాగింది. తండ్రివున్న పీధిగదిలోకి పరుగెత్తింది. ఇంతలో పెద్దబ్బాయి కేశవరావు, చిన్నబ్బాయి రాఘవరావు, బుల్లి అబ్బాయి గోపీలు ఒకరివెంట ఒకరు లేచి వారుకూడా కాఫీలు త్రాగి తండ్రివున్న పీధిగదిలోకి వచ్చారు. కమలాకరరావుగారు సోఫాలో కూర్చొని వున్నారు. ఆయన ప్రక్కన కల్యాణి వుంది. రెండవప్రైపు గోపీ కూర్చుంటూ 'నాన్నా, ఇవాళ సినిమాకు తప్పకుండా పంపించాలి' అంటూ గట్టిగా అన్నాడు. కేశవరావు 'ఇప్పుడే వస్తాను నాన్నా' అంటూ పీధిలోకి వెళ్ళిపోయాడు. ఇంక రాఘవరావు తను చదువుకునే గదిలోకి వెళ్ళి

తలుపులు ఓరవాకిలిగా వేసుకుని ఇంగ్లీషుపాఠం చదువు తున్నాడు గట్టిగా. కాలం గడచిపోతోంది, ఇంతలో సుంద రమ్మ రిక్షాదిగి, 'బాబుగారూ నాలుగణాలు రిక్షావాడికివ్వాలి. ఇస్తారూ!' అంటూ గట్టిగా అడిగేసరికి కమలాకరరావు ను కల్యాణిచేత రిక్షావాడికిమ్మనమని నాలుగణాలు పంపించారు. రోజులు సంతోషంగానే గడచిపోతున్నాయి.

ఒకరోజున నాన్నగారు గబగబా రొప్పుతూ వచ్చి "నాయనా, కేశవరావుగా కొంప మునిగింది. నేను సొమ్ము వేసిన బ్యాంకు దివాలాతీసిందట. ఒకటా రెండా ఇరువదివేల రూపా యలు. నేనేమి చేసేది" అంటూ తల చేత్తోపట్టుకుని కండ్ల వెంట నీరుకారుతుంటే దిగాలుపడి కూర్చుండిపోయారు. ఎవరు మాత్రం ఏమిచేస్తారు. ఇంతలో మా ప్రక్కయింటి పున్నయ్య గారు ఆయన భార్య చంద్రమతిగారు వచ్చి ఓదార్పు వాక్యాలు పలకడం, 'నిజానిజాలు పూర్తిగా తెలిసేవరకు బాధపడడం మంచిదికాదండీ, మీరు ఇలాగ అధైర్యపడితే పిల్లలు వారుమాత్రం బెంగపెట్టుకోరా! తల్లి లేనివారు ధైర్యంగా వుండండి' అంటూ నన్ను దగ్గరకు పిలచి 'స్కూలుకు వెళుతున్నావమ్మా! పాఠాలు చదువుకుంటు న్నావా బాగాను' అంటూ బుగ్గమీద ముద్దుపెట్టుకుంది అతి ఆప్యాయంగా చంద్రమతమ్మగారు. ఆరోజు అంతా ఎవరి మనస్సులు బాగుండలేదు. నాన్నగారికి నిజంగా జ్వరము వచ్చేసింది. రెండు రోజులలో తగ్గుతుందనుకున్న జ్వరము చివరకు పక్షవాతము వ్యాధిలోకి మార్చేసింది నాన్నగారిని. ఒక కాలు, ఒక చెయ్యి పడిపోయాయి తెల్లవారేసరికి.

వెంటనే పెద్దన్నయ్య తన స్నేహితుడు, మంచివాడు, సహాయకారి అయిన డాక్టరు రమేశబాబును దగ్గరవుండి తీసుకు వచ్చాడు. ఆతను పరీక్షచేసి మందులు తెప్పించి వెంటనే యివ్వాలని అంటే చిన్నన్నయ్య తాను బట్టలు కుట్టించు కుందుకు దాసుకున్న డబ్బుపెట్టి నాన్నగారికి మందులు కొని తెచ్చాడు.

మా పరిస్థితులు తృటిలో మారిపోయాయి. చేతిలో చిల్లిగవ్వ లేదు. వారంరోజుల క్రితమే వ్యాపార విషయంలో వున్న మూడువందల రూపాయలు మనియార్డరు చేశారు నాన్నగారు. దానితో యిటువంటి పరిస్థితిలో చిక్కుకొనడం చాలా బాధకల్గింది. క్రమేణా నాన్నగారు కోలుకోవడానికి పూర్తిగా రెండు నెలలు పట్టినది. ఈలోపుగా కలిగిన మార్పులు చెప్పడం చాలా అవసరము. మేము పడినపాట్లు ఆ భగవంతుడికే తెలియును. ఒకరోజు రమేశబాబుగారు మా యింటికి వచ్చి పెద్దన్నయ్యను నాన్నగారి విషయం, ఇంటి పరిస్థితులు అన్ని అడిగి నమస్కారాలుచేసి వెళ్ళిపోయారు. నాకు ఆ డాక్టరుగారి మాటలు చెవులకెంతో మధురంగాను ఆయన రూపురేఖ లావణ్యాలు జూసేసరికి మనస్సు అదోకలాగ అయింది. ఒకక్షణంపాటు మనసు పరిపరివిధాల ఆలోచనలతో పరుగులెత్తింది. నాకు అప్పటికి పదిహేను సంవత్సరము దాటి పదహారవ సంవత్సరం నడుస్తోంది. మనస్సు నీలాల మేఘాలపై ఎగిరిపోయే గాలి తెరలలో తేలిపోతూ తెల్లని కాంతితో పరుగులెత్తే చందమామలాగా పరుగెత్తింది మనస్సు. అనేక ఆలోచనలతో తెల్లవార్లు నిద్రపట్టక బాధపడేదాన్ని. మా

గోపీగాడికి ఎంతసేపు సినీమాల పిచ్చి. ఒక్కరోజుకూడా సర దాగా మాట్లాడి ఎరుగడు నాతోటి. పెద్దన్నయ్య కష్టపడి ఒక మందులషాపులో 'కాంపౌండరుగా' చేరాడు నెలకు వాళ్లు యాభై రూపాయలు యిస్తామన్నారుట. చిన్నన్నయ్య ఆస్పత్రి కాలేజీలో గుమాస్తాగా చేరాడు. ఇంక నేను గోపీ మాత్రం ఇంటిదగ్గర వుండేవారము. గోపీ మాత్రం ఫోర్తుఫారం హిందూ హైస్కూల్లో చదువుకుం టున్నాడు. నాకంటే మూడేళ్లు చిన్న వాడు. వాడి సినిమా పిచ్చితో యింట్లో అందరికి బాధగాను, కోపంగాను వుండేది. ఎప్పుడూ సినీమాలకు వెళుదామని డబ్బుకావాలని అడిగి నాన్నగారిని బాధించేవాడు. జీవితం ఈవిధంగా మారుతుందని కలలోకూడా ఎవ్వరము తలంచలేదు. పాపం సుందరమ్మ మానేయమని చెప్పినరోజు ఎంతో బాధ పడింది.

'బాబుగారు మీరు ఏమీ డబ్బు యివ్వనక్కరలేదు. నేనే వచ్చి మీకు యింత వండిపెట్టి వెళుతాను బాబు. మారాజులాంటివారు. మీకు యింతటి కష్టము వచ్చినదే అని చాలా విచారపడి విడువలేక బాధతో వెళ్ళింది. ఇంతకు ఎవరి కర్మకు ఎవరు కర్తలు కారుగదా! రోజులు బండిచక్రాలులాగా తిరిగిపోతున్నాయి. పండిన పండు రాలకతప్పదు. విరిసిన పూలు తిరిగి ముకుళించవుగదా. జీవితంలో గడిచిపోయిన మధురక్షణాలు తిరిగి రావుగదా: జీవితం అంటే పదిహేనురోజులు చీకటితో పదిహేను దినములు వెన్నెల వెలుగులో మునిగి తేలుతూ వుంటుంది. ఆ మాదిరివే కష్టసుఖాలు కూడాను. ఇలాగ వుండగా ఒక రోజున మా దగ్గరివాడు ఒక వేలు విడిచిన

మేనమామయట వచ్చి మా నాన్నగారితో ఏదో పెండ్లి సంబంధము గురించి మాట్లాడడము, కట్నం కానుకలు అంత అక్కరలేదన్నారని తప్పకుండా వప్పుకోమని నాన్నగారుని తొందరచేయడం సాగించాడు. ఇంతకూ అది అంతా నా పెండ్లివిషయమే. చిరంజీవి కల్యాణి నిచ్చి వివాహము చేస్తే మిగిలినవారు మగపిల్లలు కదా యింక బాధలేదు అని నాన్న గారు కూడా ఆలోచించుదామని అనుకున్నారు. దానితో నాన్నగారు ఎలాగో ఒలాగ వివాహం చేద్దామని ఆ సంబంధానికి తంబగ్గి పెళ్లికుమారుని ఒకసారి వచ్చి పెళ్ళికుమార్తెని చూచి వెళ్ళమని రాయమన్నారుట. దానితో అనుకోని ఘడియలలో మధ్యాహ్నం రెండుగంటల బండిలో ఒకరోజు పెళ్ళికుమారుడు ఆయన పెద్ద అప్పగారు ఆమె ఆఖరి కుమార్తె బండిదిగారు. పెండ్లికుమారునికి షుమారు నలుబది సంవత్సరములుంటాయి. మంచిపేరు ప్రఖ్యాతిలు సంపాదించారుట ప్లీడరీలో. పెద్దభార్యకు యిద్దరు ఆడపిల్లలు, వారికి పెళ్ళిళ్ళు అయిపోయి అత్తవారిళ్ళకు వెళ్ళిపోయినారుట, పెళ్ళాం చనిపోయి రెండు సంవత్సరాలు అయినదట. జుట్టు ఒకప్రక్క బాగా నెరిసింది. మొదటి పలువరుసలో ఒక పన్నుకూడా వూడింది కాబోలు నవ్వుతుంటే ఎంతో భయంగా వుంది. ఇంతకీ ఆయనను చూడడమంటే నాకు ఆతన్నొక తాతగారి లాగ, ఆరిపోబోతున్న దివ్వెలాగ కనుపించాడు. ఈసాంజ్యోమూ ఏమీ బాగుండ లేదని యిష్టరన్నయ్యలూ మొత్తుకుంటే నాన్న గారు ససేమిరా అంటూ ఏమైనా ఈ వివాహం జరిపించాలిసింది అంటూ మొండిపట్టు పట్టారు. మేము చెల్లాయిని ఎలాగైన

పోషిస్తాము, ఇటువంటి సంబంధముకు మేము ఒప్పుకోము అని రెండురోజులు హోరాహోరీగా పోరాడారు. అంతా నిష్ప్రయోజనమైంది. ప్లీడరుగారికి వున్న ఆస్తిపాస్తులు తలుచుకుంటే నాన్నగారికి కడుపు నిండిపోయింది కాబోలు. కన్నకూతురు జీవితం నాశనం చేస్తున్నానన్న తెలివి హీనమయినది. వివాహ ముహూర్తం పెట్టించి రాస్తామన్నారు. ఆ సమయంలో నా మనస్సు ఎలాగవుంటుందో వూహించండి మీరు. జీవితంలో పెనుగాలి వచ్చినప్పుడు విరిగిపోయిన కొమ్మ క్రింద పడక వెట్టునే అంటిపెట్టుకుని వూగులాడునట్లుగా నా మనస్సు తహతహలాడింది. వేరే గత్యంతరము లేదు. పోనీ అన్నయ్య స్నేహితుడు రమేశబాబుకు నన్ను ఈ ఆపదనుంచి రక్షించమని జాబువ్రాసి పంపుదామంటే సరిగ్గా సమయానికి డాక్టరు రమేశ్ నెలాఖరుకుగాని రారని పూనా వెళ్ళారని చెప్పారుట వారింటిదగ్గర. అతని కింకా వివాహమవలేదని అతని తల్లి తండ్రులు మెడ్రాసులో వున్నారనిమాత్రం తెలుసు కల్యాణికి. అన్నయ్యతో అతనిని చూచినదగ్గరనుంచి ఆమెకు అతనిమీద అనురాగం జనించింది. ఏవేవో వూహలతో తేలిపోయేదాన్ని. ఏవిధంగానైనా రమేశ్ బాబుకు ఈ సంగతి చెప్పి, తన్నెలాగైనా ఈ వివాహ ప్రయత్నమునుంచి కాపాడవలసినదిగా ప్రయత్నించుదామని నిర్ధారణ చేసుకుంది. సరిగ్గా వివాహానికి ముహూర్తం త్రయోదశీ మంగళవారం సాయంత్రం ఆరు గంటలకు ద్వారకా తిరుమలలో వెంకటేశ్వరస్వామి సన్నిధిలో జరిపించడానికి నిశ్చయించుకున్నారు నాన్న. నలభై ఏళ్ళవానికి పదునారు సంవత్సరముల బాలికను యివ్వడం అని అందరూ

నోళ్లు నొక్కుకున్నారు. నాన్నమాత్రం ధైర్యంగా ఠీవిగా తదనుగుణముగా అన్ని ఏర్పాట్లు చేశాడు. న్యాయము అన్యాయము అని ఆలోచించనైనా లేదు. కన్నతండ్రి అయినా కనికరించకుండా పదునాలు సంవత్సరముల బాలికను నలుబది సంవత్సరములవానికి యివ్వడం ఎంతఘోరమో కూడా గ్రహించలేకపోయాడు తల్లి చనిపోతూ నన్నుకూడా ఎందుకు చంపిపోలేదూ! అని చాలా విచారించాను. పోనీ ఆత్మహత్య చేసుకుని చనిపోదామంటే అసలే కృంగి కృశించుచున్న తండ్రి సరియైన ఆదరణలేక అలమటించిపోతున్న అక్కగారలు విషాదవదనులై కనుపించారు. వారి భవిష్యత్తు అంతా నామీదనే వున్నదని భవిష్యకాలానికి పరిస్థితి ఎలాగ వుంటుందో తెలియదు గదా. అందుకు అలాంటి పని చేయలేకపోయ్యాను. చివరకు నేనుకూడా తండ్రియొక్క పెలివిమాలిన చర్యకు, నా యొక్క గోడును [illegible] కట్టుబడి కృంగిపోయాను. వివాహము నాకు ప్లీడరుగారితో బాగానే అయింది. పెళ్లి అయిపోయిన తర్వాత రెండు మంటే నాన్నగారు పైన నాలో మంచిరోజు నిశ్చయించి పంపుతామని అన్నారుట. దానితో ప్లీడరుగారు ఆయన అక్కగారు జవాబు చెప్పకుండా వెళ్లిపోయారు. పెళ్ళికి నాకు నాలుగు జతల బంగారుగాజులు, మువ్వదికాసుల గొలుసు, నాలుగు పెద్ద పట్టుచీరలు పెట్టారు. నేను వాటిని వేటినీకూడా మనసారా కన్నెత్తి చూడనైనా లేదు. ఒక్క చీరకూడా కట్టుకోలేదు. నన్ను అవి కట్టుకోమని నగలు పెట్టుకోమని బాధించారు. అయినా నసేమిరా వాటిని తాకనైనా లేదు. నా మనస్సు నేను ఎంతగానో ఆరాధిస్తున్న డాక్టర్ రమేశ్ బాబు నన్ను కాపాడడానికి

రానన్నా లేదే? ఏమి జరిగిందో అతనికి? ఎలాగ వున్నాడో! అనే అనుమానంతో బాధపడ్డాను.

నేను ఇప్పుడు వివాహితనై చేసేదేమి లేక అనేక కష్టాలకు లోనై వున్నాను. పెద్దన్నయ్య, చిన్నన్నయ్యాలు కలిసి వారి చేతి వాచీలు, అమ్మితే వచ్చిన సొమ్ముతోను, నాన్నగారి పందిరిమంచము, వెండికంచము అమ్మితే వచ్చినదానితోను ఒక్కరోజు వివాహము గనుక కొంచము ఖర్చుచేసి వివాహము కానిచ్చారు. మర్యాదలతోనే మావారిని ఆయన అప్పగారును వాళ్ళవూరుకు పంపించారు. స్త్రీడపుగారు కూడా కక్కుర్తిపడిన వ్యక్తి అగుటవలన పిల్ల అసలు దక్కదేమోనని పంతాలు పట్టక చేసిన దానికి తృప్తిపడి ఎలాగో ఒకలాగు శుభకార్యం జరిగేవరకు మాట్లాడకుండా వుండి చివరకు నాగొంతుక కోసి పోయినారు. నేను బ్రతికివుండికూడా జీవచ్ఛవములాగా, వలలో బంధింపబడిన చేపలాగా గిలగిల కొట్టుకోవటం తప్ప మరేమీ చేయలేక పోయాను. రమేశబాబు కూడా వూరిలో లేడు. ఏదన్నా అఘాయిత్యము చేద్దామంటే ధైర్యం లేదు. పిరికితనం బంధించింది. పదిరోజులు దాటింది. ఏరోజు కారోజు రమేశబాబుకొరకు ఎదురుచూస్తూ వుండేదానిని. నాకు వివాహమయిన పదునెనిమిదవ రోజున ఒక కుర్రవాడు వచ్చి గోపీచేతికి ఏదో చీటి ఇవ్వడం నేను సరిగ్గా అదే సమయానికి అక్కడికి వెళ్ళడం జరిగింది.

'ఏమిటిరా గోపీ అది, ఆ వచ్చిన వాడెవడురా?' అని అడిగాను. వెంటనే గోపీ చేతిలోనున్న చీటి చదువుకుని "రమేశు బాబుగారు వూరిలోనికి వచ్చారుట. నాన్నగారి కెలాగవున్న

దని, తాను రావడానికి రెండు రోజులనుంచి జ్వరము వస్తోం
దని, తగ్గిన తరువాత రాగలనని వ్రాశారు' అన్నాడు. నాకు
ఆ కబురువింటే మతిపోయినట్లు అయింది. మొదటినుంచి నాకు
రమేశుబాబు అంటే చాలా ఇష్టము. అప్పుడప్పుడు అన్నయ్య
తో మాయింటికి అతనురావడం, అన్నయ్యాలు నేను, అతను
కలసి సినీమాలకు వెళ్ళడం, నాకు అతనితో మాట్లాడుతు
వుంటే వెన్నెట్లో కూచుని వుంటే చన్నీళ్లు మీదచల్లితే
శరీరము యీావత్తు ఎలాగ వుంటుందో ఆ విధంగా వుండేది.
మనస్సు పరుగులుతీసేది మబ్బులలో పరుగెత్తే చందమామ
లాగ సాధారణంగా వెన్నెలరాత్రిళ్ళలో సినీమాలకు వెళ్లే
వాళ్ళముకాని విధివశాన నాకు రమేశబాబుతో గాకుండా
చావడానికి సిద్ధమౌతున్న ప్లీడరుతో వివాహమవడం, నాన్న
గారు మంచాన పడడం; ఇంట్లో అమ్మలేకపోవడం, జీవితంలో
నిరుత్సాహం బ్రతుకంటే అసహ్యాముకలిగాయి. ఏమైనా
రమేశబాబుని తనవాళ్ళకు తెలియకుండా వెళ్ళి చూసి తన
బాధఅంతా వెళ్లగ్రక్కుకోవాలని, తనజీవితాన్ని ఒక వద్దుకు
నరకకూపంతో సమానమైన అత్తవారింట్లో పడకుండా
కాపాడమని చెప్పుకుందామని ఆక్రోశించింది హృదయం. కాని
ఏమిలాభము. రమేశబాబుని చూడడానికి వెళ్లడానికి పడలేదు
సరిగదా ప్లీడరుగారి దగ్గరనుంచి తన్ను తొందరగా పంప
మనియు, ఎంత తొందరగా పంపితే అంతమంచిదనియు జాబులు
ప్రతి రెండు మూడు రోజులకు రావడం జరుగుతూనే వుంది.
ఇంతకీ విధి బలవత్తరమయినప్పుడు మనము ఏమిచేద్దామని
ప్రయత్నించినా అది ఎదురు తిరుగుతుందికదా! భగంవంతు

దయవలన మా నాన్నగారికి కొంచెము సులువుగా వుండడము వలన మంచిరోజుచూసి నన్ను గోపీచేత అత్తవారింటికి పంపుదామని నిశ్చయించి అనుకున్నట్లుగానే ఒకరోజు పంపించారు. బాల్యవంతాన గుంజకుకట్టిన తాడును విడదీంచి వచ్చిన పాలేరుతో పంపేపెయ్యిలాగ నన్నుకూడా పుట్టింటినుంచి అత్తవారింటికి సాగనంపారు. నాన్నగారు దగ్గరగావచ్చి తలనిమురుతూ అమ్మా నాకంతా తెలుసు అయినా ఏది చేయడానికి సంఘానికి లొంగి వుండాల్సివచ్చింది. నా పరిస్థితి అంతా విధిచేత తలక్రిందులయింది. వారం రోజులు మీ అత్తవారింటి దగ్గరవుండి తిరిగి గోపీతో రాతల్లీ' అంటూంటే నాకళ్ళు, వారికళ్ళు కన్నీళ్లతో నిండిపోయాయి. తల్లిని ఎరుగకపోయినా తండ్రి అన్నగార్లు అల్లారుముద్దుగా పెంచి పెద్దచేసారు. నాకర్మకు ఎవరుకర్తలు. నాకు చిన్నతనములోనే ఇటువంటి వివాహము జరుగుతుందని కలలోకూడా నెవ్వరూ వూహించలేదు. అందుకు ఇటువంటి పరిస్థితికి దిగజారడమనే విధియొక్క వైపరీత్యము అని నాలో నేనే క్రుంగి కృశించుచున్నాను.

# 2

నేను తమ్ముడు గోపీ అత్తవారింటికి వెళ్ళామో లేదో ఆ మరునాటినుంచి మా ఆడబడుచు నాచేత పనులు చేయించడం, నీళ్ళుతోడించడం మడిసీళ్ళట, అందుకు నేనే తోడాలిట ప్రొద్దుట ఎనిమిది బిందెలు సాయంత్రము ఎనిమిది బిందెలు తోడించేది. నాకు వున్న పదిరోజులు ముళ్ళమీద వున్నట్లుగా వుండేది. బందిఖానా వేరే అక్కరలేదనిపించేది పాపం నాతో పాటే గోపీకూడా బాధపడేవాడు. చివరకు వాడు తెగించి, అక్కయ్యా నేను వెళ్ళిపోతాను ఈపాడుఖాంరిలో నేను వుండలేను బావగారు ఎంతసేపు కబుర్లు, ఆయనస్నేహితులు, పేకాటలు బలే బలే! బాగావుంది. రేపే వెళ్ళిపోదాము అన్నాడు.' అయినా వాళ్ళు పంపందే నేను ఏమిచేసేది. అలాగే మరో నాలుగు రోజులు గడిపాము. నేను మావారితో మాట్లాడడానికి ఇష్టము లేకపోయినా ముభావంగా వుండి ఏదన్న అడిగితే బలవంతంగా జవాబు ఇచ్చేదానిని. ఇంకా పునస్సంధానము అవలేదు కనుక నేను దూరంగా వుండడము అదొక మంచిగా భావించే దానిని. ఒకరోజు మానాన్నగారి దగ్గరనుంచి జాబు వచ్చింది. "నన్ను చి॥ సౌ॥ కల్యాణిని తొందరగా పంపండి అని ఇంక ఒక్కక్షణం కూడా ఆలోచించకుండా గోపీ తన బట్టలన్ని సర్దుకుని తయారు అయ్యాడు. బావగారు కోర్టు నుంచి రాగానే నాన్నసంగతి చెప్పాడు. తాము రేపే ఎండలు చేరి వాళ్ళవూరు వెళ్ళిపోతున్నామనికూడా చెప్పాడు. దానిలో ఆయన 'నువ్వు వెళ్ళవోయి, దానిని ఇక్కడనే

వుంచెయ్యి మరో వారంరోజులలో కల్యాణిని తీసుకువచ్చి దిగబెడతాను. ఇంతకు మీరందరు వున్నారుగదా నాన్నగారిని చూడడానికి. అయినా ఆడపిల్ల అత్తవారింట వుండాలి కాని పుట్టింట్లో ఎన్నాళ్లు వుంటుంది, నేను చెప్పానని, మీనాన్న గారికి చెప్పు. నేనుకూడా జాబు వ్రాస్తాలే 'అంటూ' ఇదిగో ఈపాతిక రూపాయలు దగ్గరవుంచు' అని సొమ్ముతీసి ఇచ్చారు. గోపీ 'నాకు వద్దండి. నా న్నగారు ఇచ్చింది వుంది. ఇదిచాలు సరే నేను వెళ్తాను, మా అక్కయ్యను తొందరగా పంపండి నాన్నగారికి వంట్లో బాగుండలేదని కూడా వ్రాసాను.' అంటూ ఆదారిని పోతున్న రిక్షా కేకేసి ఎక్కి స్టేషనుకు వెళ్ళిపోయాడు. కల్యాణికి దృష్టి అంతా ఇంటిదగ్గర నేవుంది. శరీరము మాత్రం అత్తవారింటిదగ్గర వుంది. కాని మనస్సు రమేశబాబు మీద వుంది. ఆమె ఒక యంత్రములాగ తిరుగుతోంది తప్ప మరేమీ చేయలేక పోయిందక్కడ. ఒకరోజు ప్లీడరుగారికి ఉదయం ఎనిమిది గంటలవేళ కొంచెము దగ్గు తెరలాగవచ్చి దాని మీదట కొంచెము గుండెనొప్పి వచ్చింది. వెంటనే ఆయన అక్కగారు తేనెతో ఏదో మందు కలిపిఇచ్చింది కల్యాణితో జాగ్రత్తగా చూస్తూవుండమని చెప్పి తాను ఆయుర్వేదవైద్యుడి దగ్గరకు వెళ్ళింది. ఈలోగా గుండెనొప్పి బాగా ఎక్కువ అవడంతో ప్లీడరుగారికి నిలువుగ్రుడ్లు పడి స్పృహతప్పి పడి పోయారు. పాపం ఏమిచేస్తుంది కల్యాణి చిన్నపిల్ల తనకు ఏమీ తెలియదు. ఇంట్లో ఎవ్వరూ లేరు. ఏం చేస్తుంది వెంటనే వీధిగుమ్మంలో నిల్చుని పెరిని వారిని కేకవేసింది. ప్లీడరు గారికి ఏదో వచ్చిందని మాట్లాడుట లేదని చెప్పింది. ఎవరో

ఇద్దరు బ్రాహ్మలు ఆమె పిలుపు విని లోనికివచ్చి చూసారు. ప్లీడరుగారి చేతిని నాడిని పరీక్షించి "ఇంకేముంది తల్లీ కొద్ది ఘడియలు మాత్రమే అంతా అయిపోయింది ఇంతలో ఇంత ముంచుకువచ్చిందే అయ్యో' అంటూ ఇంకా నలుగురిని ఆ వీధిని పోయేవారిని కేకవేసారు. ఇంతలో రొప్పుకుంటూ ప్లీడరు గారి అప్పగారు ఆయుర్వేదవైద్యులు శంకరంగారు లోపలికి వచ్చారు. గబగబా శంకరం పంతులు చేతినాడిచూసి పెదవివిరిచి ఎందుకైనా మంచిదని తాను తెచ్చిన చింతామణి తేనెతో రంగరించి ఆయన గొంతులో పోసారు. ఇంతలో ఆయన అప్పగారు' అయ్యో తమ్ముడా ఎంతపని జరిగిందిరా! వివాహం అయి నెలరోజులు కాలేదే దానిని ఆ విధంగా దిక్కుమాలిని దానిలాగా చేసి పోతున్నావుట్రా? నేనేంచేసేదిరా తమ్ముడూ' అంటూ గట్టిగా రాగాలు పెట్టింది. ఆ ఏడుపులతో ఆ దృశ్యంతో నాకు గంగ వెర్రులు ఎత్తి నట్లయింది. కండ్లకు నీటి పొరలు క్రమ్మేసాయి. నా జీవిత రేఖలు తుఫానుకు కసిరివేసే నావ మాదిరిగా ప్రయాణం చేస్తున్నట్టుగా జనిపించాయి. ఏం చేయను. ఎంత అభాగ్యు రాలిని. బ్రతుకు చీకటితో నిండింది కదా అని బాధతో క్రుంగి పోయాను.

అక్కడవున్న నలుగురుకలసి మావారిని సాయంపట్టి తీసుకొనివెళ్ళి వీధిలో పడుకోబెట్టారు. చుట్టుప్రక్కల ఇరుగమ్మలు పొరుగమ్మలువచ్చి ఎవరినోటికి వచ్చినట్టువారు సాను భూతిచూపించడం మొదలుపెట్టారు. నాకువర్ణ్య తెలియని ఆవేశాలు, జీవితం, ఆశలు, ఆనందం త్రుటిలో నశించి పోయాయే.

కొంతకాలం క్రుంగిపోయాను నాన్నగారి జబ్బు కొంచెం తగ్గడం జరిగింది. కానివారు చేసులారా నా గొంతు కోసినందుకు కంటి నిండా కన్నీరు కార్చనిరోజు లేనేలేదు, విధి ఈవిధంగా చేస్తుందని ఎవరు తెలుస్తారు. అందుకే కాలవైపరీత్యముకు కట్టుబడి పోవలసినదే మానవులందరు. కర్మ జీవితములకు కాటికి వెళ్ళినా సుఖము వుండదు. కోరికలు తీరకపోతే ప్రేతరూపము కలిగి ఆత్మకూడా బాధింపబడుతుంది. అంతా భగవంతుని లీల అనుకుంటూ రోజూ కుమిలిపోతూ వుండేదానిని.

# 3

రోజులు గడుస్తున్నాయి. కమలాకరరావుగారి స్థితి కొంత బాగుపడుతున్నదన్నమాట బాగా రావటానికి, పక్ష వాతం పొందిన పార్శ్వం స్వాధీనంలోనికి రావటానికి చాలా కాలం తీసుకుంటుందని తేలిపోయింది. ఇంకా బాగా నడువ లేక పోతున్నారు. రమేశబాబు అప్పుడప్పుడు వచ్చి ట్రీటుమెంటు చేస్తూ అందరి క్షేమ సమాచారములు తెలుసుకుంటూ వుండే వాడు. కాలచక్రంతో పాటు మనస్సులూ, పరిస్థితులుకూడా మారటం సహజమే కదా! కేశవరావుకు బెజవాడనుంచి ఎవరో పిల్లనిస్తామని వచ్చారు. సరోజ పెద్ద అందమైనది కాక పోయినా కొంచెము సంసారపక్షముగా వుండే సహజ లావణ్యా వతి. చదువుకో లేదు కాని కొంచెము మూఢాచారాలు, మూఢ నమ్మకాల యందు నమ్మిక ఎక్కువ. అయినా ఆ పిల్లకు చాలా రోజులవరకు వివాహము అవక అంటే తండ్రి కట్నము ఇవ్వ లేకపోవుట వలనను, చివరకు విధివ్రాత గట్టిదగుటవలనను, కేశవరావుకు ధర్మపత్నియై వివాహమైన కొలది దినాలకే కాపరానికి వచ్చింది. వచ్చిరావడముతో ఇంటి పెత్తనం తనే భరాయించి మామగారికి, మరదులకు, ఇల్లు బట్టిన విధవాడ బడుచుకు మొదట్లో కొంచెము గౌరవము చూపించేది. కాని కాలక్రమేణా ప్రతిచర్యలోనూ మరదులను, కల్యాణిని తీసి పారేయడం, చిన్నతనం చేయదలచుకోడం ఆధునిక యువతిగా ఆమె వ్యక్తిత్వం కనిపించడానికి బదులుగా సానుభూతి, సమ దృష్టి మొదలైన సద్గుణాలు అడుగడుగునా తక్కువవుతూ

చివరకు పూర్తిగా నశించాయి.

ఒకరోజు రమేశబాబు కమలాకరరావుగారింటికి వచ్చి అందరి క్షేమసమాచారములు భోగట్టా చేసిన తరువాత తను ముఖ్యంగా బాధపడుతున్న సమస్య కల్యాణియొక్క జీవితం ఇలాగ మారుతుందని ఆశించలేదని, ఆమె ఎక్కడ బాధపడకుండా కాంక్షేపాలకు అనుగుణంగా కుట్టు, సంగీతము, సాహిత్యము, మొదలగువాని శ్రద్ధ కలుగునటుల చేస్తే బాగుంటుందని అంటూవుండేవాడు. కాని కమలాకరరావుగారు ఏమీ వినీ విననట్లుగా వుండేవాడు. రమేశబాబు ఒకటి రెండుమాటలు కేశవరావు దగ్గర, రాఘవరావు దగ్గర అని చూచాడు. ఏమీ లాభం లేకపోయింది. పైగా వారలకు ఈమెను గురించి ఇంత మక్కువ అభిమానం ఇతని కెందుకు అన్న అభిప్రాయాలు కలుగుతూ వుండేది రానురాను. చిన్ననాడు స్నేహితులైనను పెద్దవారైన తరువాత సంసార వ్యవహారాలలో చిక్కుకున్న తరువాత మనుష్యులయొక్క మనసులూ, చేష్టలూ కాలంతో గాటే మారిపోతూ వుంటాయి. 'కొందరికి ఏ సమస్యతోనూ సంబంధము వుండదు. వాళ్ళను మనం నిద్రపోతున్న వ్యక్తిని తట్టి లేపినట్లుగా, బోధచేసి తాను ఇలాగ చెయ్యాలి దానికి పరిణామం ఈ విధంగా వుంటుంది అని నచ్చచెప్పి వారి ప్రేమకు పాత్రులవడంకొరకు మంచివాడు సర్వదా ప్రయత్నిస్తూ వుంటారు. అందులో రమేశబాబు ఒకడు, వివాహము వకపోయినను తల్లిదండ్రులకు దూరముగా వున్నను ఇంత వరకు ఒకరిచేత ఒక్కమాటకూడా అనిపించుకోక వైద్యవృత్తి చేసుకుంటూ కాలం గడుపుతున్నాడు. తల్లిదండ్రులు ఏదో

సంబంధము చూచాము, రమ్మనమంటే ఇప్పుడు అప్పుడే వివాహము వలదనియు తాను కావాలన్నప్పుడే చేసుకుంటాననియు సమాధానము రాశాడు. కల్యాణి జీవితాన్ని ఏ విధంగానైనా బాగుచేసి ఆమెహృదయవీణను మీటి తిరిగి ఆమెలో నవరసాలు వెలిగించవలెనని ఆమె జీవితం మూడు పూవులు ఆరుకాయలుగా చేయడానికి పన్నాగము వేయదలచాడు.

ఒకరోజు ప్రొద్దుటే కాఫీత్రాగి కమలాకరరావుగారి దగ్గర కూర్చున్న కేశవరావు 'నాన్నా' రమేశబాబుగారన్నట్లుగా పోనీ చెల్లాయికి సంగీతమన్నా, చదువన్నా చెప్పిద్దామా' అన్నాడు. ఇంతలో కల్యాణి నెమ్మదిగా అక్కడికి వచ్చింది. వెన్నెలంతా గూడుకట్టుకొని ఒక్కచోట ముద్దగావుందా అన్నట్టుగా ఆమె ముఖము తెల్లగా, నల్లని కనుబొమ్మలతో గీతగీసిన రేఖాచిత్రము మాదిరిగా, వున్నాయి. చక్కని ముక్కు, అందమైన పలువరస. నిజంగా కల్యాణి చాలా అందమైనదే. ఆ రోజు గులాబిరంగు చీర, పసుపుపచ్చని వాయిల రవిక వేసుకుంది. గులాబిరంగు పెదవులు, ముంగురులు ముఖముమీద పడుతున్న కేశములు చాలా అందాన్ని చూపిస్తున్నాయి. ఆమె అందాన్ని చూచి అన్నయ్యలు సంతోషపడడమూ, లేక ఆమె జీవితం ఆ విధంగా నశించడానికి విచారించడమూ వాళ్ళకు ఏమీ తోచేది కాదు. కాని కేశవరావు తనంతటతనే నాన్నగారితో పై మాటలు అన్నాడు. కల్యాణి తండ్రి దగ్గరగా కూచుని 'అవును నాన్నా' నాకు సంగీతము అంటే చాలా శ్రద్ధా' తియ్యని గానాన్ని నేర్చుకుంటే భూమినీ

ఆకాశాన్ని గిలిగింతలు పెడుతూ, అందరి హృదయాలను మధుర నాదమయించేసి సంతోష పెడుతాను. నామాత్రం జీవితంలో ఏమున్నది. ఆశలు రెక్కలు కట్టుకుని ఎగురదా మంటాయి కాని కట్టుకున్న గూడు కూలిపోతే దానిచుట్టూ తిరిగి పిట్టమాదిరిగా అయింది నా జీవిత పరిణామము. తప్ప కుండా ఆలోచించు నాన్నా సంగీతాన్ని ఎవరన్నా బాగా చెప్పేవారు వుంటే పిలిపించు నాన్నా నేర్చుకుంటాను' అంది ఎంతో నిండుగా హృదయంలోని ఆనందాన్ని అంచులవరకు అదిమిపెట్టి. దానితో ప్రక్కగదిలో పోరలు తిరుగుతున్న సరోజ గట్టిగా మామగారికి, భర్తకు వినబడేట్లుగా 'అందుకే రోజూ మొత్తుకుంటున్నాను. ఇన్నేళ్ళు వచ్చాక ఆడపిల్లలకు చదువు, సంగీతం ఎందుకు. ఇవాళ చదువు, సంగీతం వచ్చాక రేపు ఇంకా ఏమన్నా చేస్తానంటుంది. ఏమీవద్దు. ఇంట్లో పని వుంటూ వుంటుంది. ఒకపూట తనూ నేనూ సాయపడి తేనేగాని ఈ సంసారము గడువదు మామయ్యా. కల్యాణి

నేను మాత్రం ఎంత పెద్దదానిని. ~~సరోజకూడా~~ నాకు చేదోడు వాదోడుగా వుంటే ఎంతో బాగుంటుంది. ఆయన బ్రతుకు ఎలాగు చీకటిలో పడినది. దానిని చీకటిలో నుంచి తిరిగి వెలుగులోకి లాగదీయడమంటే మీ సంసార పరిస్థితు లకు తిరిగి ఒక పెద్ద పెనుతుపాను తెచ్చుకోవడమన్న మాట. నన్ను మూర్ఖురాలిగా మీరు అందరు అనుకోవచ్చు కాని మీరు అనుకున్నంత మూర్ఖురాలను నేనుగాని సంసారము మాత్రం రచ్చబండ కెక్కితేమాత్రం నేను వూరుకునేదిలేదు. మనం గొప్పవారలం కాదు, ఏదో వారి రెక్కలమీద ఆధార

పడుతూ లేస్తూవున్న సంసారాలు మనవి. అందుకే కల్యాణికి, సంగీతము వద్దు, చదువు వద్దు. అంటున్నాను మామయ్యా" అని గట్టిగా జవాబు చెప్పింది. కల్యాణికి కళ్ళనిండా నీళ్ళునిండి నీళ్ళు తిరిగాయి. గులాబి పెదవులు తడిలేక ఆరిపోయినాయి. చలిగాలికి వణికిపోయే పావురం మాదిరిగా తలను వంచుకొని అక్కడినుంచి వెళ్ళిపోయింది. కేశవరావుకూడా తలవూపుతూ ఏదో ఆలోచిస్తూ వీధిలోకి వెళ్ళిపోయినాడు. కమలాకరరావు గారు మాత్రం తన కుటుంబ పరిస్థితులలో కలిగిన మార్పుకా, విధి వ్రాతను తప్పించు ఎవరికి సాధ్యము కాదనుకొనుచు ఎడమవైపునుంచి నెమ్మదిగా కుడిప్రక్కకు తిరిగి పడుకున్నారు. వెనుకనుంచి ఎవరో వచ్చి కాళ్ళ వేపునవున్న శాలువ ~~గడ్డం~~ వరకు కప్పుతుండగా "ఎవరది" అన్నారు. "నేనే" అంటూ కల్యాణి తండ్రి చేతులను తడిమింది. కంటినుంచి కారుతున్న కన్నీటిబిందువులు కమలాకరరావుగారి బుగ్గమీద పడగానే ఆయన మనస్సు కలుక్కుమంది. "అబ్బా" అన్నారు గట్టిగా.

# 4

చీకటి రాత్రులు వెళ్ళిపోయి పున్నమి రాబోతున్నది. ఆ రోజు చతుర్దశినాటి చందమామ ఇంకా ప్రకాశమానంగా వెలిగిపోతున్నాడు. చల్లగాలి మెల్లగా వీస్తోంది. దూరాన వున్న చెట్టుమీద రెండు పిట్టలు గుసగుసలాడడం వాటి దగ్గరలో వున్న గూటిలోనుంచి చిన్న పక్షి సంతతి కుయికుయి లాడడం ఆ దృశ్యం చూస్తూ నిలబడిన కల్యాణికి మనస్సు అనేక విధాలుగా ఆరాటపడడం జరుగుతోంది. తానుకూడా స్త్రీమూర్తి అగుటవలన మాతృప్రేమకు దూరమై నందుకు, తనకుకూడా చక్కని భర్త వుండి తన సంసార జీవితంకూడా మూడు పువ్వులు ఆరు కాయలుగా గడచిపోతుం దని, రమేశబాబులాంటి అందమైన యువకుడు భర్తగా దొరికితే నవజీవన దాంపత్యాన్ని ఆనందించి జీవితంలో ఆశయాలు నెరవేర్చుకుంటూ వుండేదాన్నిగదా" అని అనుకుంటూ వుండేది. ఒక రోజు కల్యాణి మనోవాంఛలు, తీరని కోరికలు గబగబా పైకి వుబకడం, వయస్సులో దాచలేని కళవళలు ఆమెను బలంగా ఏదైనా జీవితం అనుభవించు ప్రతి జీవికి జీవితం భగవంతుడు ఆనందించడానికి, అనుభవించడానికే ఇచ్చాడు అని బాధపెడుతూ వుండేవి. తన తండ్రి రోగిష్టిగా మంచం మీదనుంచి లేవలేక అతి కష్టంగా జీవయాత్ర గడుపుతున్నాడు. రేపు ఆయన గుటుక్కుమంటే అన్నదమ్ములు, వదినగారు చేస్తారని నమ్మక మేమిటి? ఇప్పటికే వదినగారికి తనంటే అయిష్టము. అప్పుడప్పుడు కాళ్ళకావతారమెత్తుతూ

కన్నీరు చేస్తూ వుంటుంది. కనుక నా బాగోగులు భవిష్యత్తు నేనే ఆలోచించుకోవాలి. ఈ పాడు ప్రపంచం నన్నేమైనా ఆదరిస్తుందా? నాకోసం కేమైనా త్యాగం చేస్తుందా. ఇప్పుడు ఏమిటి చెయ్యాలి అని అనేక విధాలుగా మనస్సులో మధన పడుతోంది. ఇంతలో వదినగారు కేకేసింది. తిరిగి తన మనస్సును కట్టడి చేసుకుని యథాస్థితిలోనికి రాగలిగింది కళ్యాణి. రోజు లెప్పుడూ ఒకేమాదిరిగా జరుగవు. ఓడలు బళ్లు, బళ్లు ఓడలు అవవచ్చునుగదా? కాలము అనేది కర్పూరము మాదిరిగా కరిగిపోతుందెగాని దానిని కూడగట్టుకోడముతోనే వుంది మానవుని జీవితము, మానవ చర్యలు. నల్లనివన్నీ నీరు, తెల్లనివన్నీ పాలు అని నమ్మే స్వభావముగల వనితలు ఎంతమంది వున్నారో. వయసుగాం బ్రతుకో ఎర అయిపోతూ చివరకు పశ్చాత్తాప జ్వాలలలో మునిగి వారి పాలనను ఆఖరిసారిగా కడుగుకొని నశిస్తూవుంటారు. చేసేటప్పుడు ఇది మంచి, అది చెడ్డ, వివేకము, అవివేకము అనే ఆలోచనలు అన్నీ నశిస్తాయి. మనస్సు గుఱ్ఱముల పరుగులెట్టినట్లుగా పరుగు పెడుతూ వుంటుంది. ఆ సమయంలో ఆపడానికి బ్రహ్మతరము కాదుగదా. వానిని పుట్టించిన ఆ శ్రీ మహావిష్ణువుకు కూడా చేతగాదు. అదే మానిషి చేసికొనిన కర్మ. బుద్ధి కర్మ అనుసరణి అనుసరించిగా జరుగుతుంటుంది దివకృత్యాల్లో మునిగిపోతూ వున్న వాళ్లకు.

రమేశబాబు రాకపోకలు తగ్గించాడు. ఎందుచేతనో సరోజ వచ్చినదగ్గరనుంచి మరీ తగ్గించాడు. సరోజ రమేశబాబు రాగానే వెయ్యికళ్ళతో పరిశీలిస్తూ ఎక్కడ కల్యాణి

కనబడుతుందో ఎక్కడ అతనితో మాట్లాడుతుందో అని భయపడుతూవుండేది. ఇది సూక్ష్మంగా గ్రహించాడు రమేశ బాబు. సరోజకు, కల్యాణి అంటే అయిష్టము అని తెలుసుకున్నాడు. ఆమెని నిరాదరణ చేస్తూవుందని గ్రహించడమువలన ఒకరోజు సాయంత్రము తన పనిమనిషి తాయారు చేత ఒక జాబు ఎలాగయిన కల్యాణికి వదినగారు చూడకుండా అంద చేయమని పంపించాడు. తాయారు వచ్చి తలుపుకొట్టగానే అదృష్టమో, దురదృష్టమో తెలియదు కల్యాణే వచ్చి తలుపు తీసింది. ఇల్లు నిద్రపోతున్నట్లుగా వుంది "ఇంట్లో ఎవరూ లేరమ్మా" అని ప్రశ్నించింది తాయారు. "నాన్న వున్నారు ప్రక్క గదిలో పడుకున్నారు. అన్నయ్య, వదినలు సినిమాకు వెళ్ళారు. మా గోపి నిన్ననే స్కూలు పిల్లలతో ఏదో, వూరు వెళ్ళాడు. ఇంతకీ నువ్వు ఎందుకు వచ్చినట్లు తాయారు అంది కల్యాణి. తాయారు నవ్వుతూ బొడ్లోనుంచి ఒక కాగితం మడత చేతి కందిస్తూ నెమ్మదిగా "మీకు దీనిని రమేశబాబు గారు ఇమ్మన్నారు చాలా జాగ్రత్తగా సంచరించాలి వెళ్తా నమ్మా నేను వెళ్తున్నా" అని నెమ్మదిగా మెట్లుదిగి వెళ్ళి పోయింది. కల్యాణి తొందర తొందరగా తలుపు గడియవేసి తన గదిలోనికి వెళ్ళి దీపం దగ్గర జాబు చదువుతుంది ఏమను కుందో ఏమో వెంటనే రెండు చీరలు జాకెట్లు చేతిసంచిలో పెట్టుకుని, తండ్రి నిదురపోతున్నాడో లేదో చూసి వచ్చింది. కళ్ళనీళ్ళు గిర్రున తిరిగాయి. అదే సమయంలో తనకేది మంచియో, చెడ్డయో భవిష్యత్తు ఏవిధంగా పరిణమిస్తుంది అనే ఆలోచన నశిస్తుంది. ఇంతకీ తన మనోవాంఛలు కొంత

వరకన్నా అనుభవించాలి అంటే రమేశబాబుతో లేచిపోవడమే మంచిదన్న భావము ఆమెకు త్రుటిలో ప్రత్సాహోద్రేకములకు ప్రోత్సహించిది. రమేశబాబు ఆ రోజే రాత్రి ఎనిమిదిగంటల బండిలో బయలుదేరి బెంగుళూరు వెళ్ళిపోతున్నట్లుగా, కల్యాణిని కూడా తిన్నగా రైల్వేస్టేషనులో కలిసికోమని, ఆమెకు టిక్కెట్టు కొనివుంచుతానని తన జీవితబాటను బాగు పర్చుతానని రాసిన జాబును తిరిగి మరల దీపందగ్గర చదువు కుంది కల్యాణి. వెంటనే కనుకొలకులలో నిలిచిన నీరు కొనగోటితో తుడుచుకొంది. నెమ్మదిగా తలుపు తీసుకుని వీధిలోనికి వచ్చింది. తన దగ్గర తండ్రి, అన్నయ్యలు ఇచ్చిన కొంత పైకము షుమారు పాతిక రూపాయలు దగ్గర బొడ్లో పెట్టుకుంది. ఇంటికి ఒక నమస్కారము చేసి నెమ్మదిగా వీధి తలుపు దగ్గరగా లాగివేసింది. ఇంకా రెండు గంటలు వ్యవధి వుంది అన్న వదిన వచ్చేందుకు. అందుకు తను తొందరగా తండ్రి లేచి పిలువకుండా వెళ్లిపోవడం మంచిదనుకుని వీధిలో చీకటిలో కొంత దూరము నడిచి ఒక రిక్షా కేకవేసింది. చేతిలోవున్న సంచిని గట్టిగా పట్టుకొని గాలిలో కట్టుకుంటున్న వూహాల వూయలలో వూగిపోతూ రిక్షాబండిలో పడింది. ఒక్క పదుగులో రిక్షాబండి పోయి స్టేషన్ కెదురుగా నిలిచింది. కల్యాణి డబ్బులు ఇచ్చేసి నెమ్మదిగా స్టేషనులో ఆడవాళ్ల గేటుగుండా ప్లాటుఫారము మీదకు నడిచిపోయింది. కొంత దూరము వెళ్ళేసరికి రమేశబాబు ఎవరితోనో నవ్వుతూ సిగ రెట్టు వెలిగించుతూ మాట్లాడుతుండడము కనిపించింది. "అమ్మయ్య ఆయన వచ్చారు." ఇంక ధైర్యముగా వుండ

వచ్చునుకుంది కల్యాణి, ఇంతలో రైలుజాడ తెలిసిందికాబోలు ఘంట గణ గణ మ్రోగింది. స్టేషనులో జనం ఎవరి సామాను తీసుకుని వాళ్లు ప్రయాణ ప్రయత్నాల్లో వున్నారు. రమేశబాబు ఎవరికీ తెలియకుండా కల్యాణి వచ్చేవుంటుంది అనే దృఢనిశ్చయంతో వున్నాడు. రైలుబండి పొగలు గ్రక్కుతూ వచ్చేసింది. అందరూ రైలు ఎక్కేసారు. ఈసమయంలో ఆలోచించక కల్యాణికూడా రైలు ఎక్కేసింది. అది మూడవ తరగతి కంపార్టుమెంటో, రెండవ తరగతి కంపార్టుమెంటో తెలియక, రమేశబాబుకూడా ఫస్టుక్లాసులో ఎక్కికూచున్నాడు. ఒక అయిదు నిమిషాల్లో రైలు స్టేషన్ విడిచి పెట్టింది. ఒక అరగంటలో బెజవాడ చేరింది బండి. రమేశబాబు నెమ్మదిగా దిగి ఒక్కొక్క పెట్టె వెతుకుతూ, చూసుకుంటూ నడుస్తున్నాడు. ఇంతలో కల్యాణి చెయ్యి వూపింది. రమేశబాబు చిరునవ్వు నవ్వి కల్యాణి అందానికి, నవయవ్వనభారంతో వున్న ఆమె శరీర సోయగాన్ని తలచుకుంటూ మురిసిపోతున్నాడు. తాను కొన్న ఇంటరు టిక్కెట్టు వెంటనే బెజవాడలో మార్చి సెకండుక్లాసే కొన్నాడు. దగ్గరకు వెళ్లి కల్యాణికి ఆ టిక్కెట్టు దగ్గరవుంచుకోమని చెప్పి తిరిగి తాను మెడ్రాసు సెంట్రల్‌లో వచ్చికనబడుతానని చెప్పి రెండు పెరుగు అన్నం పొట్లాలు తెచ్చి అవితిని మంచినీళ్లు త్రాగమని చెప్పాడు. ఎవరికీ అనుమానం కలిగేట్టుగామాత్రం వుండవద్దని హెచ్చరించి రమేశబాబు తిరిగి తన పెట్టెదగ్గరకురావడం రైలు కూతకూసి బెజవాడ స్టేషన్ విడవడం ఒకేమారు జరిగింది.

మరునాటి సాయంత్రానికి బెంగుళూరు చేరారు,

కల్యాణి, రమేశబాబులు స్టేషన్‌నుంచి తిన్నగా Green Lands Hotelకు వెళ్ళారు. అక్కడ రమేశబాబు కల్యాణిని అలంకరించుకోమని నుదుట బొట్టుపెట్టుకుని తనతో ఎంతో చనువుగా వుండమని కోరాడు. కల్యాణికికూడా అలాగ వుండడము ఇష్టమేగనుక రమేశబాబు చెప్పినట్లుగా చేసింది. అక్కడ హోటల్లోనివారందరూ వారిద్దరినీచూసి మంచి అనుకూల దాంపత్యమని ఆనందించారు. కల్యాణియొక్క సహజ లావణ్యానికి ముగ్ధులయ్యారు. ఇలాగ పదిహేనురోజులు హోటల్లో గడిపి చివరకు ఇక చిన్నవి రెండు గదులు ముప్పయి రూపాయలకు అద్దెకు తీసుకున్నాడు రమేశబాబు కల్యాణితో కలసి కాపురం పెట్టాడు. తనకు సొమ్ము కావలసివచ్చినప్పుడల్లా మొద్రాసువెళ్లి పనిమీద వచ్చినట్లుగా తండ్రికి చెప్పి డబ్బు తీసుకుని వస్తూండేవాడు. ఇలాగ కాలచక్రం దొర్లుతూంది. కల్యాణికి నెలతప్పడం మనిషికి అనేక కోరికలు కలగడం వాటిని సంతోషంతో రమేశబాబు తీర్చడం జరుగుతున్నాయి, ఇలాగ ఎనిమిది మాసములు గడిపారు ఇద్దరు. ఇంతలో రమేశబాబు తండ్రికి ఒక జాబు వచ్చినది. అందులో రమేశబాబు ప్రాక్టీసు మానేసి ఇల్లు తాళంపెట్టి ఎక్కడికో వెళ్ళినట్లుగా అతనిమీద ఒక పుకారుకూడా వున్నదని ఆ వూరి అమ్మాయిని లేవదీసుకుపోయాడని ఈ సంగతి వివరంగా తెలుసుకోమని ఎవరో ఆకాశరామన్న జాబు వ్రాసారు దానితో రమేశబాబు తండ్రి సంకకిశోరుకి అనుమానం తగిలింది కుమారుని మీద Bank Chekes రెండు మూడు ఖర్చులవడం సుమారు రెండువేల రూపాయలవరకు ఖర్చు అవడం దానిలో

ఏదో రహస్యం వున్నదని తెలుసుకున్నాడు. ఇంక ఆలస్యము చేస్తే లాభములేదని తన కుమారునికి శేట్ నీలాంబరదాస్ కుమార్తె శాంతినిచ్చి వివాహము చేయుడానికి అన్ని ఏర్పాట్లు చేసాడు హఠాత్తుగా రమేశబాబు ఇచ్చిన ఎడ్రస్ ప్రకారం టెలిగ్రాం కొట్టాడు వెంటనే రమ్మనమని. దానితో రమేశబాబు తన తండ్రి ఎందుకు రమ్మన్నాడో గ్రహించాడు. ఇప్పుడు తాను కల్యాణిని విడిచిపెట్టి అధోగతిలో వదలి తిరిగి మరొక కన్యను వివాహమాడడం మంచిది కాదేమో అనుకున్నాడు. కాని శాంతిని వివాహము చేసుకుంటే సుమారు అయిదు, ఆరు లక్షల రూపాయలు వస్తాయి. ఎందుకంటే శాంతి ఒక్కర్తే కుమార్తె కాబట్టి తండ్రి ఆస్తికంతయు ఆమె అధికారిణి. నందకిశోరు మద్రాస్‌లో ఒక పెద్ద వ్యాపారి. చిన్నతనంనుంచి రమేశబాబుకి తన కుమార్తెనిచ్చి వివాహము చేద్దామని అనుకుంటుండేవాడు. చివరకు ఆ కళ్యాణ సమయం రానేవచ్చింది. అందుకు రమేశబాబు కల్యాణిని వున్నదాన్ని వున్నట్టుగా వదిలివేసి మద్రాస్ వచ్చి వివాహమాడడం, తనకు ఏమీ తెలియనివానివలె నటించి అంత ఏదన్నా పీకిమీదికి వస్తే కల్యాణికి డబ్బు కావలసినది పారేసి బిడ్డను ఏ అనాధ శరణాలయానికో అప్పచెప్పమని చెపుదామని ఉపాయ మాలోచించాడు. ఒకనాడు కల్యాణికి తెలియకుండా, నీళ్ళాడే ప్రొద్దులు వచ్చాయని తెలిసికూడా ఆమెను అయోమయ పరిస్థితిలో వదలివైచి మద్రాస్ వచ్చాడు. ఆ మహాపురుషుల చేష్టలు ఎంత నీచమైనవి. ఇష్టము వచ్చినట్లు పూరించి, లాలించి తమ అవసరములు తీర్చుకొని చివరకు

వాడిన పువ్వులు బయట పారవేసినట్లుగా వదలివేసేదరని ఏమీ తెలియదుకదా అమాయకులకు. కల్యాణికూడా అంత వరకు ఆలోచించలేకపోయింది. అందుకే ఆమెకు రమేశబాబు చేసిన ప్రతి చర్య నిజమేనేమో తనను చివరకు వివాహము చేసికొనునేమోయని తలంచేది. అంతేకాని ఇంత నికృష్టంగా, కష్టదశలో ఆమెను వదలివైచుటకు ఆమె నిస్సహాయురాలై చాలా విచారించింది. ఇప్పుడు ఎక్కడకు పోతుంది. ఏ మొహం పెట్టుకుని పుట్టింటికి వెళ్తుంది తిరిగి. జీవితంలో చేసిన పనికి పాప ఫలితం అనుభవించవలసినదే కదా ! తనకు బిడ్డపుడితే వాడిని ఏవిధముగా పెంచడము. తండ్రి ఏడీ, ఎవరు అని అడిగితే ఏమి చెప్పడం అనే ఆలోచనలలో మునిగి ఎప్పుడూ బాధపడుతూ వుండేది, చివరకు ఆమె తిండితిప్పలూ మాని కనే సమయానికి తగిన బలము లేక నానా అవస్థలు పడడము మొదలుపెట్టింది. అటువంటి పరిస్థితులలో నిజముగా భర్తే అని తలంచిన వారం దరూ ఆమెను అపహాస్యము చేయడం, చులకనగా చూచి నీచంగా మాట్లాడటం చేస్తూవుండేవారు. తొమ్మిదవ నెల దాటి పదవనెల రాగానే ఒకరోజు ఆమెకు కడుపులో ఏదో బాధ ఎక్కువైంది. వెంటనే పాపం అంతవరకు ఇంట్లో పని మనిషిగావున్న రామిని గ్రతిమాలుకుంటే అది బండితీసుకుని వచ్చి కల్యాణిని ఆడవాళ్ళు పురుడుపోసుకొనే గవర్నమెంటు ఆస్పత్రికి తీసుకుపోయింది. అతి కష్టముమీద కల్యాణి సాయంత్రము అయిదు గంటలకు మగశిశువు అంతా రమేశ బాబు పోలికతో జన్మించాడు. ఎంత సంతోషపడి ఏమి లాభము తన జీవితములో కట్టుకొన్న గాలిమేడలు కూలి

పోయాయి. రెండవమాయకూడా తాను బ్రతికివుంటే తన బిడ్డను గెలిచేసి సంఘము బ్రతుకనీయదు, తను చేసిన అవినీతి పనికి తన ముక్కుపచ్చలారని పసిబిడ్డ బలి అవవలసిందేనా ఇప్పుడు ఏమి చెయ్యను. బిడ్డతో తానుకూడా ఏ నుయ్యో గొయ్యో చూచుకొంటే పీడ విరిగిపోతుంది. ఎవరికీ తనవారలకు గాని, రమేశబాబు వారికుగానీ ఎటువంటి కష్టములు అపనిందలు రావని తలంచుకుంటూ వుండేది. కాని తిరిగి తన బిడ్డముఖముచూచి వాని లేత నవ్వులు, బోసినోరు పాల్గారు చెక్కిళ్ళు ,పచ్చని చాయ మాతృహృదయంతో వానిని హృదయానికి హత్తుకుంటూ బాధలన్నీ గాలిక ఎగరగొట్టబడే దూదిపింజలమాదిరిగా విరిగి పోయేది. తప్పుచేసినా, చేయక పోయినా మాతృదేవియొక్క ప్రేమ, ఋణము తీర్చుకొనుట ఏ జీవికి సాధ్యముకాదు గదా ! తొమ్మిదినెలలు మోసి, తన రక్తాన్ని ఆహారమిచ్చి ప్రాణమిచ్చి, శరీరమిచ్చి కని పెంచి పెద్దచేయడానికి అనేక త్యాగాలు చేసేకన్న తల్లి ప్రేమ ఘనమైనది గదా ! తనకు తన తల్లి చనిపోవుటవలననే తనరాత ఆ విధంగా బ్రద్దలై కడుపులో పెట్టుకొనేవారు లేక అందరిచేత మాటలు పడుతూ చివరకు ఆశలు నెరవేర్చు కుందుకు రమేశబాబుతో లేచివచ్చినది. చివరకు విధివ్రాత వలన ఇక్కడకూడా ఆమె మోసానికి బలిఅయి, బిడ్డతల్లిఅయి సంఘానికి మరొక కళంకినిగా మారింది. ఎన్ని అనుకుంటే ఏమి లాభము, ఇంకా భవిష్యత్తు చూచుకొని తన బిడ్డను ఎలాగ పెంచాలి ఏమి చెయ్యాలి అనే భవిష్యత్తును ఆలోచించడానికి మనస్సుకు ధైర్యము చెప్పుకుంటూ వుండేది.

ఆమెకు పాపం అన్నివిధాలా రామి కూడా సహాయుర్నాలై పూర్తిగా నిర్చింది ఎలాగో ఒకలాగ పదిహేను రోజులకు బిడ్డతోసహా ఆసుపత్రినుంచి కల్యాణి ఇంటికి చేరుకోనడం, అద్దె కట్టనందుకు యజమాని సామాను బయటపెట్టడం కల్యాణికి దిక్కులేనిదై దుఃఖిస్తూన్నంటే పాపం రామి తన గుడిసెకే రమ్మనమని తీసుకుని వెళ్ళి ప్రాణస్నేహముతో కాపాడటం అన్నీ జీవితములో జరిగే విధివైచిత్ర్యములు.

కల్యాణి తలచినది ఒకటి జరిగినది వేరొకటి. అక్కడ రమేశబాబు వివాహము శాంతితో బహుసుందరముగా వైభవముగా జరిగినది. పది రోజులవరకు బంధువులలో, లక్షాధికారి కుమార్తె, సౌందర్యరాశి అయిన శాంతిదేవి సాహచర్యంలో ఆనంద తరంగాల్లో మునిగి తూగిపోతున్నాడు రమేశబాబు. మనస్సులోనుంచి ఏనాడో గెంటివేయబడింది కల్యాణి చిత్రము. చివరకు ఆమెలో పెరుగుతున్న తన జ్యోతి అంకురము విషయముకూడా మరచిపోయేటంత పరిస్థితికి జారాడు రమేశబాబు. అవును. అక్కర తీరినతరువాత ఎవరైనా తిరిగి వారిమొహము చూస్తారా. చూడరు. ఇది ప్రపంచక ధర్మం. మహాత్యాగమూర్తులు, మంచి సంఘ సంస్కర్తలుగా చెలామణి అవుతారు గాని నిజంగా నిజుకెల్లా విసనే వారిలో ప్రవహించేది. ఈ రోజు కల్యాణి నిజంగా కన్నులుతెరచి సత్యా అసత్యములను, మనుష్యులూ వారి యొక్క మనసులను గ్రహించడం, అర్థంచేసుకోవడం నేర్చుకొన్నది. ఆమెకు చివరకు సరియైన మందు పడక, బలమైన ఆహారములేక, పచ్చిబాలింత అగుటవలన కృశించడము

మొదలుపెట్టినది. ఆదరించి ఆమె బాగోగులు కనుక్కునేవారే లేరుగదా ? పాపం రామి ఏ పూర్వజన్మ సుకృతమువల్లనో కల్యాణిని, పాపాయిని ఇంతవరకు సాకుతున్నది. కల్యాణికి పురుడు నెల వచ్చి దాటేసరికి ఆమెకు బలహీనతవలన చివరకు క్షయవ్యాధి కొంచెము కొంచెముగా అంకురించినది. నిజమే! మనిషికి సంతోషము సగము బలమన్నారు. అది లేకపోతే మరి ఏమున్నది మానవ జీవితానికి. చేసిన పాప ఫలితాలే గదా మనిషికి అండదండలు. కల్యాణి దూరాలోచన లేకుండా చేసిన చర్యకు విధి ఈవిధంగా శిక్షించింది. అందుకే ప్రతి దినము కడివెడు నీళ్లు కురిపిస్తూ దీనవదనంతో శుష్కించిన శరీరంతో నులక మంచం మీద తహ తహలాడిపోతోంది కల్యాణి. ఒక్కసారి తనను అల్లారుముద్దుగా పెంచిన తండ్రి, చిన్నతనంలో ఒక్కతే చెల్లెలు అగుటవలన ఇద్దరన్నయ్యలు భుజములమీద కూర్చుండబెట్టుకొని కాశీ కావిడి ఆటలు జ్ఞాపకము వచ్చేసరికి కల్యాణి గుండె బ్రద్దలయ్యేటట్లుగా గట్టిగా ఏడ్చేసింది. ఆమె ఏడుపుకు ప్రక్కనే వెదురుపేళ్ళ చాపమీద చింపిరిగుడ్డలమధ్య పండుకొన్న పసిపాప లేచుమన్నాడు. కల్యాణికి జీవితం అంటే ఒకవిధమైన నిర్లక్ష్యం, అసహ్యం, ఈర్ష్య ఉత్పన్నమైనవి తాను గలగలలాడుతూ, కలకలనవ్వుతూ సంచరించే వయస్సులో ఇటువంటి కఠిన శిక్షలకు బలిఅవడం మన్నోదికదా ?

# 5

ఇంక ఆమె తండ్రి కమలాకరరావుగారికి పక్షవాతం కొంచెం తగ్గడం, మళ్లీ ఎక్కువ అవడంతో ఒక కాలు, చెయ్యి కుడి కన్ను పూర్తిగా స్వాధీనము తప్పినవి. వారికి కల్యాణి లేచిపోవడంతో అభిమానం, అవమానాలు తల ఎత్తు కోకుండా చేసినయి ఇరుగమ్మలు, పొరుగమ్మలు వచ్చి సరోజను "మీ ఆడబడుచు ఏదమ్మా, ఏమైంది! ఎంతపని చేసిందో" అని బుగ్గలు నొక్కుకుంటూ అంటూవుంటే సరోజ సిగ్గుపడిపోయి లోపలికి వచ్చి తలుపులు దబాలున వేసి గట్టిగా ఏడ్చేసేది. తాను అనుకున్నంతపని కల్యాణి చేసిందని కసితీరా తిట్టింది. ఎప్పుడన్నా కనబడితే కత్తిపీటతో వంకాయ ముచ్చిక నరికి పారేసినట్లుగా సరికేద్దామనేంత కోపం కల్గేది. ఒక స్త్రీ చేసిన పాపఫలితానికి ఆమేకాదు అనుభవించేది ఆమె వంశము లోని పుట్టినవారు, పుట్టబోయేవారు కూడా సంఘంలో చెడ్డగా వేలెత్తి చూపించబడతారు కదా! సరోజకు ఇప్పుడు నవ మాసములు నిండి నేడో రేపో బిడ్డను కనే పరిస్థితిలో నున్నది. కేశవరావుగారుకూడా అన్నివిధాల అవమానాలకు లోబడి చెల్లెలు పేరుచెబితే కారాలు మిరియాలు నూరేసేవాడు. అసలు చెల్లెలే లేదనుకొనేవాడు. తన తండ్రికి తాము ముగ్గురు కుమారులము జన్మించామనే భావాన్ని బాగా అలవర్చు కొన్నాడు రాఘవరావు వివాహము చేసుకొనక బ్రహ్మచారి గానే వుండదలచాడు. ఇంక గోపీ చదువుకునే వయస్సుగదా! రోజులు, వారాలు, నెలలు, సంవత్సరాలు గడుస్తున్నాయి. సరిగ్గా కల్యాణి వెళ్లిపోయి నాలుగు సంవత్సరములు జరుగు

తున్నాయి. కమలాకరరావుగారికి పూర్తిగా వార్ధక్యం వచ్చి నది. ఒక్కొక్క సమయంలో కట్టుకున్న భార్య, తనను ఇటు వంటి దీనునిగాచేసి ఈ ప్రపంచాన్ని విడిచిపోవడం, కన్న కూతురుకు కట్నం ఇచ్చుకోలేనివాడని మంచి ధనికుడు, విద్యా ధికుని కిచ్చి వివాహము చేస్తే ఆవిధంగా జరుగడం, తరువాత పోనీ కల్యాణి బుద్ధికలిగి వ్వుంటుంది అనుకొంటే ఆమె అలా రమేశబాబుతో లేచిపోవడం అతనికి గుండెలమీద సుత్తె దెబ్బల మాదిరిగా తగిలాయి. అతి సున్నితమైన హృదయ కుసుమానికి, ములుకు వంటి బాధలు తాకిడి కలిగినది. ఇంక ఏ ఆశలతో మనిషి జీవిస్తాడు. సంక్రాంతి దగ్గరకు వస్తున్నది. తన జీవితంలో ఎన్నో సంక్రాంతులు వచ్చినవి వెళ్లినవి. కాని ఒక్కదానికి తాను సంతోషముగా తన భార్య వున్న ప్పుడు తప్ప మరెన్నడు సంక్రాంతి పండుగ చేసుకోలేదు. ఈనాడు తన కోడలు సరోజకు మగశిశువు కలగడం తిరిగి తాత అనే పదవిలో వున్న దర్జాకు సంతోషపడి భోగిపళ్ళు పోయి స్తాము, తను తన మగబిడ్డలు అందరూ కులాసాగా ఏకపఙ్క్తిని కూర్చుని పండుగరోజుమాత్రం భోజనం చెయ్యాలని ఆశిస్తు న్నాడు కాని రాత్రివేళల నిద్రపట్టక ఆకాశంకేసి చూస్తూ నక్ష త్రాలను లెక్కపెడతాడు. ఇంతలో కళ్ళకు నీటిపొరలు క్రమ్మేస్తాయి. ఆ పొరలలో కృశించి శోకదేవతలాగా కల్యాణి రూపము ప్రత్యక్షమయ్యేది. దానితో ఆతని మనస్సు కళవళ పడిపోయేది. ముల్లుగుచ్చుకుంటే "అబ్బా" అంటే బాధ తగ్గి నట్టుగా "అమ్మా కల్యాణీ! వచ్చావా తల్లీ" అంటూ పిచ్చిగా ఏడ్చేవాడు. ఎంత మమకారాన్ని చంపుకుందామని

ప్రయత్నించినా తామరాకుమీద నీటి మాదిరిగా మరచి పోదామన్న రక్తస్పర్శకు నశింపులేదు. మనిషి రక్తమంతటా వ్యాపించి నిండివుండే జీవకణాలు పూర్తిగా నశిస్తేకాని ఆ ప్రేమ ఆ బాంధవ్యము చెడదు. ఆ కుటుంబము మొదట్లో ఎంత సంతోషంతో, సిరిసంపద తో తులతూగుతూ వుండేదో ఈనాడు అటువంటి అనుకోని పరిస్థితులకు ఆహుతి అయి కృంగిపోవలసి వచ్చింది కాని ఒక్కొక్క కోరికకు తిరిగి చిగురించిన ఆకులలాగా ఆనందాన్ని పుంజుకునేందుకు ప్రయత్నిస్తున్నారు క్రమేణా. కొన్నిరోజులు చీకటి, కొన్నిరోజులు వెన్నెల సహజమేకదా. ఇంతేకదా జీవన స్రవంతితో ప్రవహించే జీవితము.

అనుకుంటూండగానే వచ్చింది సంక్రాంతి పండుగ. ఆరోజు ఉదయాన్నే పెందరాళే లేచి సరోజ పసిపాపకు తలంటుపోసి' వెచ్చని నీళ్ళతోడి భర్తను మరదులను స్నానము చేయమంది. మామగారికి ఎంతో ఆదరంగా స్నానము చేయించి ముద్దులమూటగట్టు మనుమడిని అలంకారముచేసి పట్టుచొక్కా తొడిగి చేతికందించింది. ఏదో వాళ్ళ అవస్థకు తగినట్లులా పిండివంటలు చేసికొని కొంచెము ఆనందములో పాలుపంచుకొనేట్లుగా వుందామనుకున్నారు ఆరోజు. సరిగా భోజనాలు అందరూ చేసి తాంబూలం వేసుకుని వీధి సావిడిలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు, సరోజమాత్రం పసిబిడ్డను మామగారి దగ్గరనుంచి తీసుకుని పడుకోబెట్టి నిద్ర బుచ్చడానికి గదిలోకి వెళ్ళుతూవుంటే, గుమ్మంలోనించి ఎవరో కేక వేస్తున్నారు. కమలాకరరావుగారు 'ఎవరదీ' చూడమ్మా !

'సరోజా' అంటూండగా బండివాడు ఒకడు మూడు సంవత్సరముల మగబిడ్డను చిరిగిన చొక్కాలో వున్నవానిని, వళ్ళు, జుట్టు అంతా దుమ్ముపట్టి వాడిపోయిన ముఖము కలవానిని ఎత్తుకొచ్చాడు. కంటివెంట కారిన కన్నీళ్ళు కాబోలు చారలు గట్టివున్నాయి. నవ్వుతూవుంటే బుగ్గ సొట్టపడుతోంది కాబోలు చిన్న సొట్ట బుగ్గమీదవుంది. విశాలమైన అందమైన కళ్ళు, పచ్చని ఛాయ, నల్లని కనుబొమ్మలు అచ్చంగా ఆ బిడ్డను చూస్తే కళ్యాణి ఛాయాచిత్రము ఒక్కమాటు కంటిలో మెదిలింది సరోజకు. నిర్ఘాంతపోయింది. కమలాకరరావుగారు 'ఎవరదీ సరోజా'? అంటూ ప్రశ్నించారు. లోపలి గదిలోంచి రాఘవరావూ, గోపీ పరుగెత్తుకొని వచ్చారు వారి గదుల్లోంచి. వారినందరిని చూచి బాలుడు గట్టిగా ఏడ్వడం మొదలెట్టాడు. చేతిలో ఒక చిన్న సంచీవుంది. బండివాడు 'బాబూ మీ గుమ్మం దగ్గర ఈ బాబుని దించమని ఎవరో ఆడమనిషి పంపారు. మీ ఇంటిముందు ఉన్న చెట్టుక్రింద బండి ఆపుకొని వచ్చాను. బాబూ ఆయమ్మ తెల్లవార్లు దగ్గుతూనేవుంది. నిన్న రెండుమార్లు రక్తము. అబ్బా! చెప్పలేను తండ్రీ ... ఏమి వాంతి చేసుకుందో. ఆ మహాతల్లి ఎంతపాపము చేసుకుందో! ఈ పసిపాపను చూచి ఒకటే ఏడుపు తెల్లవారు జామున వచ్చిన రైలుబండిలోనుంచి దిగినదట. ఎవరూ బండి కట్టనంటే, నేనుమాత్రం మనసుండబట్టక జాలికలిగి తీసుకొచ్చాను దొరా! రండి ఒక్కమాటు ఆయమ్మ ఎలాగో చూడండి' అన్నాడు.

వెంటనే రాఘవరావు, గోపీ, సరోజ వీధి గేటుదాటి

బండి దగ్గరకు వెళ్ళారు. బండిలో రక్తపు మరకలతో వున్న గుడ్డలమధ్య వాలిపోయి స్పృహించి మాట్లాడలేని పరిస్థితిలో ఒక మూగజీవంలాగా కన్పించింది ఒక స్త్రీమూర్తి. మొదట గుర్తుపట్టలేకపోయారు. కాని అంతర్యంలోనున్న రక్తస్పర్శ ఉద్రేకం వల్ల గోపీ ముందుగా ఆమెను గుర్తుపట్టి 'అక్కయ్యా! అక్కయ్యా' అంటూ ఏడవడం మొదలెట్టాడు. సోదర ప్రేమకు సోదర ప్రేమయే సాటి ! రాఘవరావు, గోపీ, సరోజా ఆమెను నెమ్మదిగా దింపి తీసుకురమ్మని బండివాడికి చెప్పి లోపలనే కర్రపట్టుకుంటూ వీధిగుమ్మం దగ్గరనుంచి గేటు దగ్గరకి తూలుతూ పడుతూ లేస్తూ కమలాకరరావుగారు 'ఏమిటిరా నాయనా! ఎవరది' అంటూ వచ్చారు. బండివాడు రాఘవరావు మెల్లిగా కళ్యాణిని సాయంబట్టి తీసుకుని వచ్చారు. ఇంటి ఆవరణలో పడుకోపెట్టారు. కొంచెము కొన ఊపిరి ఉంది కాబోలు కళ్యాణి ఒక్కమారు కనులు తెరచి అటూ యిటూ చూచి తండ్రిని గుర్తుపట్టింది. అన్నయ్యను పోల్చుకుంది. తన బిడ్డ అన్నయ్యగారి ప్రక్కనే ఎత్తుకుని నిలబడ్డ బండి వానికేసి చూపిస్తూ అందరికి చేతులెత్తి నమస్కరించింది. ప్రక్కకు వాలిపోయింది పక్షి ఎగిరిపోయిన పంజరంలాగ అయిపోయింది ఆమె దేహము. 'అమ్మా! కళ్యాణీ! అమ్మా! అంటూ కమలాకరరావుగారు, అక్కా అంటూ గోపీ, చెల్లాయి అంటూ రాఘవరావు దుఃఖసముద్రంలో మునిగిపోయారు. సరోజ మాత్రం కళ్యాణి దగ్గరగా కూర్చుని ఆమె పరిస్థితికి కన్నీరు రాల్చడం మొదలెట్టింది. పుత్రికా వాత్సల్యంతో కాస్సేపటికి కమలాకరరావుగారు స్పృహతప్పి పడిపోయారు.

సంఘంలో పతితయైనను స్త్రీ తాను స్త్రీయే! శిరోకుసుమమే. తాను ఏవిధంగా కాలుజారినా తప్పుకొనడము తిరిగి కష్టమే. అందుకే పెద్దలు, అనుభవజ్ఞులు అన్నట్లుగా 'ముల్లువచ్చి అరిటాకుమీద పడినా, అరిటాకు వచ్చి ముల్లుమీద పడినా జరిగే ఫలితం ఒకటే! ఆనాటి సంక్రాంతి పండుగరోజు ఆవిధంగా జరిగింది. ఇంతలో బయటికిపోయిన కేశవరావు తొందరగావచ్చి ఈ దృశ్యాన్ని తిలకించాడు. ఆడవాని దగ్గర నున్న బాలుని దగ్గరకు తీసుకున్నాడు. ఆ బాలుడి చేతిలో వున్న సంచిలో రెండు జాబులుండుట గ్రహించాడు. ఆ జాబులను తీసి చదివితే అందులో ఒకటి సమాచారం, రెండ వది తండ్రి అన్నదమ్ములకు అని వ్రాసుంది. కేశవరావు ఈవిధంగా చదవడం ఆరంభించాడు.

(నాన్నగారికి, అన్నయ్యలకు నమస్కారములు. మీ అనుంగు కుమార్తె, సోదరి వ్రాయు విన్నపములు. జరిగిన దానికి విచారించి లాభములేదని నా నమ్మకము. కాని నా రక్తాన్ని పంచుకుని పుట్టిన నా బిడ్డను మీకు అందించాలన్న ఆశతోనే ఇక్కడకు రాగలిగాను. నా బిడ్డ యింక పంచి సరోజ వదిన బిడ్డయే. అంతియేకాక మీరా కుటుంబము అంతటికి సంక్రాంతిరోజున యివ్వదలచిన గొప్ప కానుక నా రక్తంతో రక్తం నా అనుంగు బిడ్డ ... బహుమానం ... ఇతడే ... ఇతడే ... క్షమించవలెను.)

నాన్నగారూ ఆఖరిసారి నమస్కారములు.

ఇట్లు,
మీ కల్యాణి రమేశ్.

అని ఉత్తరాన్ని చదవడం ముగించాడు కేశవరావు. కళ్ళనీళ్లు వెల్లువలై ప్రవహించాయి. చాలా బాధపడ్డారు అక్కడివారందరు. చుట్టుప్రక్కల జనం యావన్మందీ చుట్టు ముట్టేశారు. అయ్యో పండుగరోజు ఎంతపని జరిగిందీ అంటూ ముక్కుమీద వేలు వేసుకొని ఆశ్చర్యపోయినవారు. సాను భూతి చూపినవారు చాలామంది వున్నారు ఆ గుంపులో, తన సోదరి తప్పుచేసింది నిజమే కాని పిరికితనం వదలి ధైర్యంగా నిలబడి తన బిడ్డకొరకు ఆ రమేశ్ వంశవృక్షాన్ని దిరిగి అందించేవరకు తన చెల్లెలు జీవించింది అంటే భగవంతుని దృష్టిలో అది తప్పుగా పరిగణింపబడలేదు కదా అన్న సమన్వ యానికి వచ్చాడు కేశవరావు. ధైర్యంతో నిలబడడమేకదా మానవుని కర్తవ్యం. ఎవరు ఎన్ని అన్నా తన సోదరి ఆత్మ శాంతికి చిహ్నంగా ఆ మెబిడ్డ తన మేనల్లుడు అయిన బాలుడిని దగ్గరకు తీసుకుని ముద్దుపెట్టుకున్నాడు. కల్యాణి పంచభౌతిక దేహం మరి మూడుగంటలలో పండుగదినాన అగ్నికి ఆహుతి అయింది అయినవారి అమృతహస్తాల్లో దగ్గరగా. ఎక్కడో దిక్కుమాలినదానిలాగ కాక అదే ఆమె జీవితంలో జరిగిన అదృష్టపు ఘడియ. ఆ శరీరము చేసుకున్న పూర్వజన్మ సుకృతము. వినా ఆమె జీవితాన్ని అనేకరకాల వడిదుడుకుల్లో నడిపినప్పటికి ఆఖరుదశ ఆమెకు మంచిదయింది. అదికూడా అటువంటి పతిత స్త్రీలకు జరుగదుకదా అయినవారి చేతిలో. ఇంతేన విధి బలీయముగా నున్నప్పుడు మంచియైనా చెడ్డయైనా రాసిపున్నది జరుగకమానదు, 'విధిని గెల్చుట కెవరితరము' అంటూ ఎవడో బిచ్చగాడు పాడుకుంటూ పోతూవుంటే

క్రమేణా కమలాకరరావుగారు తనప్రక్కనే నిద్రపోతున్న మూడు సంవత్సరాల ముద్దుల మనుమడిని దగ్గరకు వడిలోనికి తీసుకున్నాడు. 'నాయినా, నీపేరు ఆ వెన్నెలదొంగ కృష్ణయ్య పేరు తెలుసా' అంటూ మనుమడికి 'మదనగోపాల్' అని నామకరణం చేసేశాడు.

# 6

కమలాకరరావుగారు కాలాన్ని బట్టి మరణించడం, రాఘవరావు సన్యసించి బదరీనారాయణ వెళ్ళిపోవడం, గోపీ స్కూలుఫైనల్ పేసయి Co-operative Registrar officeలో L.D.C గా చేరడం వెంట జరిగాయి. కేశవరావు, సరోజ తమ బిడ్డ అయిన కమల్‌తోబాటే కల్యాణి కుమారుడు మధుని కూడా సమాన ప్రేమతో పెంచుతున్నారు. శిశిర ఋతువు దాటగానే వసంతం ఉదయించినట్లుగా మూడుసంవత్సరములు దాటి క్రమేణా పదిసంవత్సరముల వాడు అయ్యాడు కల్యాణి కుమారుడు. కమలకంటే మూడు సంవత్సరములు పెద్ద అప్పుడప్పుడు సరోజత్తయ్య మాఅమ్మ ఏది. ఎక్కడుంది, నువ్వేనా మాఅమ్మవు అని సందిగ్ధపడుతూ, అమాయకంగా అడుగుతుండేవాడు కాని పది సంవత్సరములు ప్రాయము వచ్చిన దగ్గరనుంచి శ్రద్ధగా చదువుకోవడం [illegible] మామయ్య అత్తయ్యల కనుగుణంగా [illegible] న్నాడు. కల్యాణి అందము, రమేశబాబు తెలివి తేటలు వచ్చాయి బంగారానికి మెరుగుపెట్టినట్లుగా అతని అందచందములు

బుద్ధి తెలివితేటలు అందరి ప్రేమకు అనుపమానముగా చేసాయి. కమల్ రెండవక్లాసు చదువుతుంటే, మధు ఆరవ తరగతిలో చేరినాడు. అందరిని మించిన తెలివితేటలలో స్కూల్లో పరీక్షలలో ఫస్టుక్లాసులో మార్కులు, తెచ్చుకుంటూ హెడ్మాస్టరుకేగాక, ఆ స్కూలు నడిపేకమిటీ మెంబర్లకు కూడా ప్రీతి అయ్యాడు. అందువలన కేశవరావు మధుకు తల్లి దండ్రులు లేని వాడని, అనాధ అని అయినా తాను పెంచదలచుకున్నానని అందరికి చెప్పి కమిటీ మెంబర్ల చేత హెడుమాస్టరుగారితో స్కాలరుషిప్పు ఎన్నిరోజుల చదువుకుంటే అన్నిరోజులు సొమ్ము కావలసిన పుస్తకాలు ఇప్పించేటట్లుగా ప్రయత్నించాడు. దానితో మధుకు ఎటువంటి కొరత గలుగక క్రమేణా ఆరవ తరగతినుంచి పదునారు సంవత్సరములు వచ్చేసరికి S.S L.C. స్కూలుకు ఆ జిల్లాకు ఫస్టుగా ప్యాస్ అయ్యాడు. ఈసంగతి తెలియగానే కమిటి మెంబర్లు హెడ్మాస్టరు,మాస్టర్లు అందరూ సంతోషించి స్కూలుకు మంచి పేరు తెచ్చినాడని ఒకరోజు మీటింగువేసి చక్కని బహుమానములు, పుస్తకములు ఇచ్చి మధుని గౌరవించి ఆదరించారు. మీటింగునుంచి మధు ఇంటికివచ్చి అత్తయ్యకు, మామయ్యకు తనకువచ్చిన బహుమానములు చూపించి వారిద్దరికి వంగుని కాళ్ళకు నమస్కరించాడు. సరోజకు కనుకొలకుల్లో కన్నీరునిలిచింది. కేశవరావు అమాంతం మధుని గట్టిగా కౌగలించుకొని ముద్దుపెట్టుకొని, నాయనా! మధూ మీఅమ్మవుంటే ఎంతసంతోషించేదో, జరిగిపదాన్ని తలుచుకోవడం బాధ కలుగుతోంది, ఏమైనా నువ్వు బుద్ధి కలిగి ఇంతవాడవవుతున్నందుకు నాకు ఆనందము,

ప్రేమఎక్కువవుతున్నది. తండ్రీ చిరంజీవివై వర్ధిల్లు, అంటూ కళ్ళ నించి అశ్రువులు రాల్చాడు. మధు ముఖముమీద రెండు కన్నీటిబిందువులు పడేటప్పటికి మామయ్య ముఖముకేసి చూసి "మామయ్య మాఅమ్మ ఎలాగవుండేది. ఏమనేది. ఎందుకు చనిపోయింది" అంటూ అమాయకంగా అడిగాడు. కేశవరావు ఇప్పుడు కాదునాయనా తరువాత చెబుతాలే 'అంటూ అతన్ని చదువుకోమని హెచ్చరించి వెళ్ళిపోయాడు. మధు జీవితంలో పగటి కలలకంటూ భవిష్యత్తులోకి ఏవిధంగా పోదామా, ఏమిచేద్దామా అని ఆలోచిస్తూండేవాడు. వేసంగి సెలవులు అయిపోవడం, కేశవరావు అన్నారిలో రామచంద్ర రావుగారిద్వారా మద్రాసులో లయోలా కాలేజీలో ఇంటర్ మిడియట్ క్లాసులో seat సంపాదించి మధుకి అయ్యేఖర్చు హైస్కూలు కమిటీవారిచేత ఏర్పాటుచేసాడు కాలేజీలు తెరవగానే మధు వెళ్ళి మద్రాసులో లయోలాకాలేజీలో F. A. మొదటి సంవత్సరంలో Join అయ్యాడు. సరోజ మధుకి కావలసిన సామాగ్రి అన్నీ కట్టిఇచ్చింది. మూడుజతల బట్టలు కుట్టించారు. కన్నబిడ్డకంటె మిన్నగా ప్రేమతో మధుని మద్రాసు సాగనంపారు. అప్పటికి సరోజకు ఏడవమాసం జరుగుతోంది. మధు మద్రాసువెళ్ళిన రెండునెలలకు ఆడ శిశువును కన్నది. ఆబిడ్డకు శశి అని నామకరణము చేసినారు. మధు వచ్చిన వేళావిశేషము మంచివి. చాలాకాలమునకు కమల్ తరువాత శశి కల్గినదన్నందుకు మధుమీద మరింతమంచి అభిప్రాయము కలిగినది. ఈలోపల కేశవరావు తాను సంపాదించిన ధానితో వేరొక ధనికుని సహాయముతో చిన్నమందుల

పాపు పెట్టి దానిని దినదిన ప్రవర్ధమానముగా పెరిగించి వృద్ధిలోకి తీసుకువచ్చాడు. చెల్లెలిమీదవున్నడే అమితవాత్సల్యము, రక్తస్పర్శ బాధచేత కల్యాణి మెడికల్ స్టోర్సు అని పేరుపెట్టుకున్నాడు  కాలం విచిత్రమైనది. విధిని దాటటానికి ప్రేమింప బడడానికి మానవుల కసాధ్యమైనపని. అందుకే విధి బలీయమని అంటారు. రోజులు బండి చక్రాలలాగ దొరులుతూ కాలవేగాన్ని గూడా గమనింపక దినచర్యలల్లో మునిగిన మానవులు ప్రపంచం తీరు తెలుసుకొంటే ప్రతిమనిషిలోను ఏదో ఒక అప్రమత్తత, అమాయకత్వము, అసూయ మొదలైన గుణములు కనుపిస్తూనేవుంటాయి. కాని కాలపరిధి అడుగుభాగమున అవి నలిగిపోతూ వుంటాయి అప్పుడప్పుడు.

ఇంక మద్రాసులో క్రొత్తపెళ్ళికూతురుతో రమేశబాబు వళ్ళు మరిచి విహరిస్తూ తన జీవితంలో శాంతినితప్ప మరెవ్వరిని చూడలేదని, ప్రేమించలేదని ఆమెను వుబ్బించి అనేకవిధముల భోగభాగ్యాలతో తూగించితేల్చే వాడు. అతను కల్యాణిని పూర్తిగా మరచిపోయినాడేగాని ఒక్కొక్క రోజు రాత్రి నిద్రలో మెలుకువచ్చి కల్యాణి గర్భమున తన ప్రాణప్రదమైన తన ఆత్మరూపము పెరగడం ఆ పెరుగుతున్న జీవము బయటపడిన తరువాత స్త్రీయైనదా, పురుషుడైనదా? ఎవరు! ఏమైనది. ఎక్కడవున్నదో! కల్యాణి ఏమైనది తనకు ఆమెను కలిగిన ప్రేమఫలము కొరకు ఒక్కొక్కప్పుడు పరితపించేవాడు. కాని ఆతనికి తెలియనిబాధ మనసులో రేకెత్తేది. వెంటనే శాంతిదేవి జూచి ఏమన్నా అనుకుంటుందేమోయని తనబాధ తెలియనిచ్చేవాడు కాదు. కాలక్రమేణ వివాహము

యిన అయిదు సంవత్సరాలకు శాంతిదేవికి గర్భమురావడం ఆ గర్భములో శిశువు చనిపోయి బలవంతముగా ఆపరేషన్ చేసి బిడ్డను తీసివేయడమువలన శాంతిదేవికి తిరిగి గర్భము వచ్చినా శిశువు బ్రతుకదని అదేకాక శాంతిదేవి ప్రాణమునకు కూడా ప్రమాదమని పెద్దపేరు మోసిన డాక్టర్లు చెప్పారు. ఆమెకు బిడ్డ సంచిలో ఒక నరము తెగిపోయినదనియు దానిని కుట్టి కుదిర్చిన తిరిగి గర్భమువచ్చిన తల్లి ప్రాణమునకు ప్రమాదమనియు హెచ్చరించారు. ఆవార్తలో రమేశబాబు కనిన పగటికలలు అన్నీ బూడిదలో పోసినపన్నీరయ్యాయి. వివాహమై పదునారుసంవత్సరములు జరిగినా ఇంతవరకు తన వంశవృక్షము పెరగడముగాని తన మానసము సంతోష తరంగాలలో తేలలేకపోతోంది. ఏమిలాభము తినడానికి ఎంత డబ్బు లక్షలు మూలుగుతున్నాయి. శాంతికికూడా చక్కని బిడ్డను ఎవరినన్నా తెచ్చుకుని పెంచి పెద్ద చెయ్యాలన్న కోరిక అప్పుడప్పుడు కలుగుతూవుండేది. తన జీవితానికి ఇంక తనకు తనబిడ్డఅని చెప్పుకొనే భాగ్యము భగవంతునిదయ లేదేమో అని బాధపడేది రమేశబాబు మాత్రం కల్యాణికి చాలా అన్యాయము చేసాను ఆ పాపం నన్ను కట్టి కుదుపుతోంది. కల్యాణి జాడ తెలుసుకుని ఆమెకు తనవలన కలిగిన గర్భస్థశిశువు విషయమై తెలుసుకోవాలన్న కోరిక దృఢంగా ఏర్పడి ఆమరునాడే బెంగుళూరు వెళ్ళిపోయినాడు.

బెంగుళూరు వెళ్ళినాడేగాని పూర్వము తాను, కల్యాణి నివసించిన యింటికి వెడితే ఆయిల్లు పూర్తిగా పడగొట్టి ఎవరో దాతలు సరిక్రొత్తగా తిరిగి కట్టుకున్నారు. అక్కడ

ఎవరిని ఆమెనుగురించి అడిగినా లాభము లేకపోయినది ఆ వెంటనే రమేశబాబుకు తలవని తలంపుగా రాామి జ్ఞాపకానికి వచ్చింది, కాని దాని ఇల్లు ఎక్కడో, అది బ్రతికివుందో చచ్చిపోయిందో ఏమీ తెలియదుకదా! పోనీ తిరిగి తాను కల్యాణి వాళ్ళవూరు వెళుదామంటే సామాను అంతా మనిషిని పంపించి పది సంవత్సరముల క్రితమే తెప్పించుకున్నాడు. ఆయిల్లు కాళీ చేసేశాడు. ఆనాడు తానెవరో కల్యాణి వూరిలో ఎవరికీ తెలియదు ఒక్క కేశవరావు, సరోజ తలితప్ప వారలకు కూడా రమేశబాబు పదునాలు సంవత్సరముల క్రితమే తెలియునుగాని అతనుచేసిన ఘోరచర్యకు వారు అవమానితులై అసహ్యించుకున్నారు. వారి వంశమునకు కళంకము తెచ్చేందుకు ప్రయత్నించిన వ్యక్తినిగురించి తెలిసికొనే అవసరమేముంది, కనుక తన్ను అందరూ మరచిపోయే వుంటారని నిర్ధారణ చేసుకుని రెండురోజులు ఎక్కిన రిక్షాదిగకుండా రాత్రింబగళ్లు వాకబుచేస్తూ అంతపట్నంలో రామిని చివరకు ఒకనాటి మధ్యాహ్నం వేళ రైల్వేస్టేషన్ దగ్గర ఒక చెట్టుక్రింద కండ్లు లేని కబోదిన్ని బిచ్చమెత్తుకుంటూ వుండడము చూచాడు. పూర్తిగా రామి అని చెప్పేటంత గుర్తులేను కాని చాలా అనుమానంతో దగ్గరకు వెళ్ళి "అవ్వా నువ్వు ఇంతకు పూర్వం ఎక్కడన్నా పనిచేసేవా! ఎవరిదగ్గరవున్నావు నీకు యెవరు నా అనేవాళ్ళు లేరా? అని ప్రశ్నించాడు. దానితో రామికి పదహారుసంవత్సరముల క్రితం విన్న కంఠ ధ్వనిలాగ వుంది వెంటనే ఆమె కనుకొలకుల్లో కన్నీరునిలిచింది.

'బాబూ నేను కష్టపడి పెంచుకున్న నా బిడ్డ, మను

మడు ఏమైనారో తెలియదు. వారికోసం చాలాకాలం ఎదురు చూశాను. చివరకు దిక్కులేనిదానినై నాను దొరా! నాకు నా అను వారెవ్వరు లేరు. ఈవిధంగా బిచ్చమెత్తుకొని జీవం నిల్పుకొన్నాను.' అంటూ కల్యాణమ్మా ఎక్కడున్నావమ్మా బాబూ ఎక్కడున్నావో. ఈ చేత్తో పెంచాను, పాలుపట్టాను. దురదృష్టవంతురాలను వారలను దక్కించుకోలేకపోయాను అంటూ విలవిలా ఏడ్చింది. దానితో రమేశబాబుకు చాలా జాలి గలిగింది. వెంటనే అక్కడ దగ్గరలోనున్న ఒక కూలిని పిలిచి వానిచేత హోటలునుంచి టిఫిన్ కారియరులో అన్నము తెప్పించి రామికి కడుపునిండా అన్నము పెట్టించాడు. ఇంత వరకు రామి అతనెవరో తెలుసుకోలేకపోయింది. ఒకవిధంగా రమేశబాబును గుర్తుపట్టలేకపోయింది వయస్సు, గ్రుడ్డితనము వలన. కాని కంఠధ్వనిని మాత్రం గ్రహించింది. అతని కొంచెము అతను చేసిన పాపపు పని, అమాయకురాలైన కల్యాణి జీవితాన్ని నాశనముచేసి ఆమెను అయోమయస్థితిలో, పూర్ణ గర్భవతిని వదిలివెళ్ళినందుకు రమేశబాబును చాలా నిందించింది. రమేశబాబు కిక్కురుమనకుండా అన్నీ ఆలకించి తాను ఆనాడు గర్వంతో ఎంత నిర్లక్ష్యం చూపించాడో కల్యాణి పరిస్థితిని గూర్చి ఆలోచించడంతో అతనికి చాలా పశ్చాత్తాపము కలిగినది. అతను చాలా ఆలోచించి అప్పటికి రెండు మూడు గంటలు అవడంతో 'అవ్వా, నేను రమేశ బాబుని, నిర్భాగ్యుడను, కల్యాణిని ఆమెకు కలిగిన సంతానాన్ని తీసుకుపోయేందుకు వచ్చాను' అన్నాడు. దానితో రామి 'అయ్యో, బాబు మీరెంత పని చేశారు. ఆమె

గొంతుక కోసేశాడు. ఆ మహాలక్ష్మి గుమ్మడిపండంటి కొడు కును కంది. ఎంత చక్కనివాడు బాబూ అంతా మీ పోలికే, మీ నవ్వే. మీ రంగే, ఏమి వర్ణించేది దొరా! మీరు నిర్భాగ్యులు కాకపోతే అటువంటి అమూల్యకురాలు, అటు వంటి బిడ్డ దక్కుతారా బాబూ' ఎవరు చేసుకున్న ఖర్మ వారు అనుభవించవలసినదే దొరా! నేను ఎంతో శ్రమపడి ఆ మెను ఇంటివారు అద్దెకట్టలేదని గెంటివేస్తే నా గుడిసెకు తీసుకొచ్చి బాబుకు మూడు సంవత్సరములు వచ్చేవరకు సాకతి దొరా! ఇంతలో కల్యాణమ్మకు క్షయవ్యాధిట అంకు రించింది. దానితో ఆయమ్మకు మనస్థిమితము, ఆరోగ్యము పాడైపోయాయి ఎప్పుడూ మిమ్మల్నిగురించే, తనేకాకుండా తను కష్టపడి కనిన తన బిడ్డకొరకు తపన పడిపోయేది. ఇప్పుడు చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకుంటే ఏమిలాభము దొరా! అంతా అయిపోయింది. ఆమె ఎక్కడకు పోయిందో తెలియదు. ఇప్పటికి పదమూడు సంవత్సరములనాటి గాథ ఇది! అంటూ రెండుచేతులు ఎత్తి రమేశబాబుకు మ్రొక్కి 'బాబూ ఈపూట కడుపునిండా అన్నము పెట్టినారు. ఎన్ని రోజులయిందో కదా బాబూ ఇటువంటి తిండి తిని' అని అనేక రకాలుగా పొగిడింది. తెలుసుకోదలచిన సంగతి రమేశబాబు తెలుసుకున్నాడు. చాలా సంతోషించాడు కల్యాణి కొడుకునే వంశవృక్షాన్నే తన రక్తాన్ని పంచుకుని కన్నదని విని 'కల్యాణి, నా కనా' అంటూ నిజంగా కడుపులో బాధతో రామి ఎరుగు కుండా ఏడ్చేశాడు!' ఊరుకో దొరా! ఊరుకోండి, జరిగిన దానికి వగచి లాభములేదు. అయిన మీరు చదువుకున్న

మారాజులు, గొప్పోరు ఆమెను అలాగ మోసగించి ఆమె జీవితాన్ని ఆ ముద్దులపాప భవిష్యత్తును ఆలోచించకుండా పాడుచేశారు, నా జీవితకాలంలో ఆమెను మరచిపోను దొరా! చాలామంచిది. గుణవంతురాలు మిమ్ములనే నమ్మ కొంది. చేసినపాపం వూరికే పోతుందా. నాకు ఈ క్షయ వ్యాధి సోకింది. దానితో నేను అంతమైపోతానే రామీ! నా బిడ్డ నీ బిడ్డే సుమా అనేది. కాని ఒకరోజు ప్రొద్దుటే నేను లేచి చూచేసరికి ఎటుపోయిందో తెలియదు దొరా! ఇంకేమి చేతునో కూతురా అంటూ గోలుగోలున వూరు అంతా గాలించాను. కాని చివరకు నెలరోజులకు ఆమెను మరచి పోయాను. లేకపోతే నా జీవితము భారము అయ్యేదిగాదా దొరా! ఇప్పుడు మళ్ళీ నా హృదయంలో ఏనాడో అణగిన పడిన కల్యాణి, ఆమె పసిపాపను జ్ఞప్తికి తెచ్చారు' అంటూ పాపం రామి కన్నీళ్ళు తుడుచుకుంది. రమేశబాబు నిజంగా తాను ఆనాడు శాంతిని లక్షాధికారిణి అని భావనతో వివాహం మాడి ధనవంతుడ నవుదామని తలంచి ఎంతో నిర్దాక్షిణ్యా ముగా కల్యాణికి శిక్ష విధించినందుకు భగవంతుడు తిరిగి తనకు శాంతియందు అదేవిధమైన శిక్ష సంతతి లేకుండా పోవడం, చివరకు విరక్తి అన్నీ కలగడానికి తను చేసిన పాపపు చర్యయే గదా! అని అనుకుంటూ రామిదగ్గర సెలవు తీసుకునేముందు పదిరూపాయల నోటుతీసి రామి చేతిలో వుంచాడు. రిక్షావాణ్ణి పిలచి తిన్నగా బజారుకెళ్ళి, అక్కడ నుంచి ఒక ఫొటోగ్రాఫర్ స్టూడియోలోకి పదునాలు సంవత్స రముల క్రితం తాను కల్యాణి కలసి తీయించుకున్న ఫొటో

దొరుకుతుందేమోనని ఆశించి వెళ్ళాడు. ఆ ఫోటో స్టూడియో లోకి వెళ్ళేటప్పటికి దానిలో ఒకటి రెండు మూడు ప్రెస్ సైజు చేసిన ఫోటోలుమాత్రం వున్నవి. రమేశబాబు లోపలనుంచి ఎవరన్నా వస్తారా అని ఆలోచిస్తూ స్టూడియో హాల్లో ఎదురు చూస్తున్నాడు. ఇంతలో ఒక కుర్రవాడు వచ్చి 'ఏమి కావా లండీ సార్' అన్నాడు. 'ఇక్కడవుండే స్టూడియో యజమాని కావాలండీ, వారి పేరు నాగరాజ్, మీరు తెలిస్తే ఒకమారు పిలిపించండి చాలా అవసరము అన్నాడు రమేశబాబు. 'వెంటనే వారు చనిపోయి ఎనిమిది సంవత్సరా యింది సార్. అతను మా నాన్నగారే. ఇప్పుడు వారి స్థానంలో నిలచి నేనే ఈ వ్యాపారము చేసుకుంటున్నాను. మీకేమి కావాలి చెప్పండి' అని తిరిగి అడిగాడు. దానితో రమేశబాబు కొన్ని గుర్తులు చెప్పి తాను, కల్యాణి కలసి తీయించుకున్న ఫోటో గురించి అడిగాడు. లోపలగదిలో ఏదో ఒక పెద్ద ఫోటో తన తండ్రి పదిలముగా దాచివుంచాడని దానిపైన కల్యాణీ, రమేష్ అని అక్షరాలు వ్రాయబడివున్నాయని చెప్పి లోపలి నుంచి ఆ ఫోటో తీసుకువచ్చి రమేశబాబుకి చూపించాడు. దానికి ఫోటోగ్రాఫర్స్ ఎగ్జిబిషన్‌లో పూర్వము ఒక బహు మతికూడా వచ్చినదనియు దాని సొమ్ము అయిదువందల రూపాయలు రమేశబాబుగారి పేర సెంట్రల్ బ్యాంకులో వేసినారనియు చెప్పినాడు. బ్యాంకులో వేసిన సొమ్ము రసీదును తెచ్చి రమేశబాబు కిచ్చినాడు. నన్ను రమేశబాబుగా గుర్తిం చాడు, ఆ కుర్రవాడు. 'బాబూ నమస్కారములు ఆమె ఎంత అందమైనది బాబూ! ఆయమ్మ కులాసాగా వుందా'

అని ప్రశ్నించేసరికి వళ్లు జల్లుమంది. ఫొటోలోనున్న కల్యాణి ముఖంకేసి చూసి నేను గట్టిగా మళ్ళీ ఏడ్చేశాను. ఎంత అన్యాయము చేశాను.' అనుకుంటూ వానిదగ్గర సెలవుతీసుకుని తిరిగి మద్రాసు చేరుకున్నాను మరునాడు.

# 7

స్త్రీ అంటే సాధారణంగా సంఘంలో ఒక విధమైన శైలికభావము వుంటూనే వుంటుంది. కాని స్త్రీ ఎల్లప్పుడూ మాతృమూర్తిగా, స్త్రీకి సహజత్వముగా వచ్చే నిస్వార్థం, త్యాగం, సహనము, దయ, జాలి మొదలైన కోమలమైన గుణగణాలు ఆమెలో ప్రజ్వరిల్లుతాయి. అందుకే స్త్రీ సృష్టి, స్థితి లయకారిణి అన్నారు. దుఃఖం వచ్చినా, సుఖం వచ్చినా, కోపము వచ్చినా, పగవచ్చినా స్త్రీ పురుషుని కండదండయై అనేకరకములైన పాత్ర ప్రాధాన్యాలకు నాయకురాలై సంసార యాత్రలు నడుపుతూవుంటుంది. కాళిదాసు మహాకవి వంటి వాడు కూడా స్త్రీని అనేక కార్యాచరణముల సలహాలకు ఆమెను మంత్రిగాను, దానశీల, ధర్మానుచితములకు తల్లిగాను, సౌందర్యోపాసనాదులయందు, భోగభాగ్యములయందు భార్య గాను, గృహిణిగాను, అతిథిసత్కార్యములయందు గృహిణి దాసిగాను అనేకవిధములైన ఉత్కృష్ట పాత్రలను సృష్టిం చాడు. కనుక స్త్రీ జాతియే ఒక పూర్ణస్వరూపమై మానవ జాతికెల్లను మాతగా నమ్మబడినది. మన నాగరీకయుగంలో ఒక మహాకవి రాసినట్లుగా 'జయ జయ ప్రియభారత, జన యిత్రి దివ్యధాత్రి, జయ జయ శతసహస్ర నరనారీ హృదయ నేత్రి' అని ఎంతో ఉచితంగా వాడారు. ఆమెయేకదా అందరికి ఏకైక జననీ, శక్తిస్వరూపిణి. శరత్ బాబువంటి బెంగాలీ కవి కూడా స్త్రీయందు, సహనత్వము, నిస్వార్థత, ప్రేమ, కరుణ మొదలైనవి సృష్టించి అవి మణిపూసలుగా ఆమె కలంక రించాడు. స్త్రీలో మాతృమూర్తిత్వం ఎప్పుడు కనపడుతూ

వుంటుందో అంతకాలము ఆమె నిస్వార్థత త్యాగశీలాన్నే ప్రకటిస్తూ వుంటుంది. అందుకే బుద్ధభగవానుడిలాంటి మహాతపశ్శాలి కూడా చివరికి, స్త్రీకి పూర్తిగా సన్యసించు అధికారాము, సంఘారామములో నిర్విఘ్నముగా మానవకోటికి సేవ చేసే భాగ్యం కలుగచేశాడు. అక్కడ స్త్రీమూర్తి తన మాతృత్వమును ఎల్లవేళలా ప్రకటిస్తూ ఆమె మానవసేవ, అహింసల కాలవాలమౌతూ తన జీవితాన్ని సార్థకము చేసుకోవాలనే వ్యూహ ప్రకటించాడు. స్త్రీనిగురించి తెలియని వాడు వుండడు లేకపోతే జగతియే లేదు. ఇది అంతా ఎందుకంటే రమేశబాబు వివాహము చేసికొన్న స్త్రీమూర్తియగు శ్రీమతి శాంతి దేవిలో కొన్ని విచిత్రమైన సహజ సౌభాగ్యములు, పరిశీలనలు, తెలివితేటలు మనకు అప్పుడప్పుడు కనపడుతూ వుంటాయి.

రమేశబాబు తిరిగి మద్రాస్ రాగానే తను తెచ్చిన పెద్దసైజు ఫోటో హాల్లో ఒకప్రక్కగా వ్రేలాడదీశాడు. అది చూసి శాంతిదేవి ఒకరోజు రమేశబాబుని ఆ ప్రక్కనున్న స్త్రీ మూర్తిని గురించి ఒక్కమారే అడిగింది. దానికి రమేశ బాబు మన కులదేవత అని ఎంతో ప్రేమకంఠంలో ఒదుగుతూ వుంటే జాలిగా జవాబు యిచ్చాడు. దానితో శాంతిదేవి తిరిగి సమాధానము చెప్పలేదు సరికదా ఆరోజునుంచి ఆమె తన నిత్య పూజా ప్రార్థనలలో ఉపయోగించు పూలమాలలలో నొకదానిని తెచ్చి ఆ ఫోటోకు రోజూ ధరింపజేసేది. కుంకుమ తెచ్చి కల్యాణీ ఫాలత ముఖ ధరింపచేసేది. ఇక్కడ శాంతి తన ద్వేషభావాల్ని వదలి భర్త గౌరవించే ఆ పవిత్ర

నైన స్త్రీమూర్తియందు తానుకూడా భక్తి ప్రవృత్తులతో మెలగడానికే ప్రయత్నము చేసింది. ఆమెకు నిజంగా కల్యాణిని గురించి ఎన్నడూ చెప్పలేదు. తాను కల్యాణిని లేవదీసుకుని, నొకబిడ్డను కూడా కలిగివున్నట్టుగా శాంతికి తెలియదు. రమేశ బాబు ఒక విచిత్ర బాధను, మనోవ్యాకులతను కలిగి విగ్రహ పుష్టిగా మాత్రమే కనుపిస్తున్నాడుకాని అతని అంతర్యమున, చేసిన పాప ఫలితములు అతని కెల్లవేళల వెంటాడుతూనే వున్నవి. అందుకే మానసిక దౌర్బల్యమునకు తిరిగి బలాన్ని అందించి క్రమణా తిరిగి మానసికోత్సాహము, ధైర్యము, త్యాగము కలుగజేసుకొనడానికే ప్రయత్నించాడు. అందుకే కల్యాణి గర్భవాసిమైన శిశువును తన రక్తస్పర్శతో కలిగిన వాడే గనుక ఆ బిడ్డను తీసుకునివచ్చి తన వంశాంకురముగా నిలుపుకొని తన మిగిలిన జీవిత సర్వస్వమును వారి కర్పించ వలెనని కోరిక. తాను లక్షల కధికారి, శాంతికూడా అతనికి అనుంగు ధర్మపత్ని. చేదోడు వాదోడై కనుసన్నలలో మెలు గుతూవుండే ప్రియమైన ధర్మపత్ని. విధివైపరీత్యములను తలచుకొన్నా, చూసినా చాలా ఆశ్చర్యము కలుగుతూ వుంటుంది. ఒక్కొక్క సమయంలో విధి మంచి కలుగ చేస్తుంది. ఒక్కొక్క సమయంలో ఆవిధే, దుర్విధిగా తయా రయి ఎన్నో జీవరాసులను బాధల కష్టాలపాలుచేస్తుంది. మంచి కూడా చెడ్డలోని ఒకభాగమే కదా! వెన్నెలకూడా చీకటిలో భాగమే కదా ? కనుక ఎప్పుడు బ్రతుకు చీకట్లను చీల్చుకొచ్చే ప్రభాతకాల రేఖలను సృష్టించుతూవుంటుంది. భగవంతుని చేష్టయగు విధి. విధి ఒక చేతలమైన ఆయుధము, దానిని

కర్మాకర్మల చర్యలయందు భగవంతుడు విసురుతూ పరుగెత్తే గుర్రాలకు కళ్ళెమువేసి లాగి ఆపు సన్నట్లుగా నిలిచిపోయే మానవకోటికి వజ్రాయుధం మాదిరిగా ఉపయోగిస్తాడు విధి అనే చర్యను.

మద్రాస్‌లో లయోలా కాలేజీలో ప్రవేశించిన 'మధు' తన నిత్యకృత్యములయందును, చదువుయందును అమిత శ్రద్ధ తీసుకుంటూ మంచిపేరు కలిగివున్నాడు. ఆటపాటల యందు ముఖ్యంగా క్రికెట్ ఆటయందు తనకు తానే సాటి యనిపించుకుంటూ అనేక ప్రశంస లందుకున్నాడు. మద్రాస్ కొత్త ఢిల్లీలో జరిగిన అఖిల భారత క్రికెట్ ఆటల పోటీయందు పాల్గొని మంచి పేరు ప్రఖ్యాతులను కల్గినాడు. క్లాసులంతకు ఫస్టుక్లాసుగానే గాక మద్రాస్ యూనివర్సిటీలో ఇంటర్మీడియెట్ చదివే కుర్రాళ్ళందరిలోకి ఫస్టుగా అంటే యూనివర్సిటీకి మొదటివాడుగా వచ్చాడు. అందరూ ఆతని తల్లిదండ్రుల యొక్క పుణ్యఫలమేగదా యీ బాలుడు అనుకునేవారు. సహజ సౌందర్యమందు మన్మధునకే ఓటుగాను, మంచితనము లోను, ప్రేమించుటయందు మానవాతీతునిగా మసలేవాడు. ఎన్నడు ఎటువంటి ఆడంబరములు లేక తనకు స్కాలరుషిప్పు పంపిన సొమ్ముతో చదువుకునేందుకు కావలసిన జీతం కట్టి మిగిలినదానితో తన తిండికి సరిపెట్టుకునేవాడు. కాని బట్టలు మాత్రము ఎల్లవేళల ఆతని బీదతనాన్నే చాటేవి. ఒక్కొక్కరోజు అతని స్నేహితులు చాలా బాధపడేవారు. ఎన్నో వేళాకోళములు చేసేవారు. కాని కించిత్తుకూడా లొంగేవాడుకాడు. తన పరిస్థితి తనకు తెలుసు. అప్పుడప్పుడు

మేనమామ ఏదన్నా సొమ్ము కావలిస్తే వ్రాయమని ప్రేమతో రాసేవాడు. అంతమాత్రముచేత తాను రాసి తెప్పించుకొని ఖర్చు చేయవచ్చు కాని అదికూడా మదన్‌కు ఇష్టములేదు. ఎలాగో గడిపి తన విద్యను పూర్తిచేసుకుని వృద్ధుడగుచున్న తన మేనమామకు అండదండగా వుండవలెనని సంకల్పముతో వున్నాడు. మేనమామ కొడుకు కమల్ తనకంటె చిన్నవాడు. అతనుకూడా శ్రద్ధగా చదువుకుంటూ బుద్ధిగానే పైకి వస్తున్నాడు. అతను తండ్రికి చేదోడువాదోడుగా వున్నా లేక పోయినా సంఘములో తప్పుగాను, అన్యాయముగాను కనపడదు. కాని తనమాత్రం నిర్లక్ష్యభావము చూపినా, అగౌరవము చేసినా కృతఘ్నుడు అంటుంది లోకము. అది తన జీవితానికి ఒక మచ్చగదా! మల్లెపూవ్వులు చూడడానికి తెల్లగా మంచి సువాసన కలిగి మనస్సుకి హాయిగా చేస్తాయి. కాని అది మరుక్షణంలో చెయ్యి తగులగానే వాడిపోతాయి. అంతే పూలు మాసిపోయినట్లుగా కనిపిస్తాయి. జీవితం కూడా అంతే. మంచిగా మర్యాదగా సుశిక్షితమైన ప్రవర్తనను చూపించినా కూడా విధి అనే బలవత్తరమైన చర్యను లోనౌతుంది. ఇటువంటి భావాలు మనస్సులో రేకెత్తుతూ అప్పుడప్పుడూ మదన్ చాలా బాధపడేవాడు. చివరకు ఇంటర్మీడియట్ పూర్తి అవగానే ఇంజనీరింగులో చేరాలని తన మామయ్య చెప్పిస్తాడో లేదో అనే సందిగ్ధము కలుగుతూ వుండేది. తను ఇంటర్మీడియట్ పరీక్ష ఫస్టుక్లాసులో ప్యాసు అయ్యాడు. అందరికి చాలా సంతోషమైంది. హైస్కూలు కమిటీవారు యింక డబ్బిచ్చి సహాయము చేయలేమని వేరే

ఏదైనా రాబడివచ్చే ప్రయత్నము చేయమని కేశవరావుతో చెప్పినారు. దానితో పాపం కేశవరావు మాత్రం ఏమిచేస్తాడు. ఇంజనీరింగు అంటే మాటలా! కొన్ని వేలు ఖర్చు అవుతుంది. ఎక్కడనుంచి తెస్తాడు తానుమాత్రం. తనది చిన్న సంసారం ఏదోవిధంగా ఇంతవరకు ఆ వచ్చిన స్కాలరుషిప్పు సహాయంతో చదివించాడు. ఇంకేమి చేయాలి అన్న ఆలోచనలు చేస్తున్నాడు కేశవరావు. రాత్రింబగుళ్ళు అదే ఆలోచన. చివరకు వేసంగి సెలవలు పూర్తి అవడం అయినా మదన్ చేత రెండు మూడు ఇంజనీరింగు కళాశాలలకు దరఖాస్తు పెట్టించాడు అన్నివిధాలా భగవంతుడు వున్నాడు అన్న ధైర్యంతో. అనుకున్నట్లుగానే మద్రాస్ ఇంజనీరింగు కళాశాల వారు సీటు మదన్‌కు ఇచ్చామనియు వెంటనే వచ్చి డబ్బు కట్టవలెనసియు ఎక్స్‌ప్రెస్ డెలివరీ జాబు వ్రాశారు. మొత్తం మూడువందల రూపాయలు కట్టాలిట మొదటి టరమ్. ఎక్కడ నుంచి తెస్తాడు అయినా ఆలోచించి తాను తన ముందుల పాప్రకుగాను దాచిపుంచిన నాలుగువందల రూపాయలు తెచ్చి మదన్ చేతిలోబెట్టి మద్రాస్ వెళ్ళమన్నాడు. వెళ్ళేటప్పుడు సరోజకు, మేనమామలకు, కన్నులనిండా ప్రేమ నీళ్ళతో నమస్కారముచేసి వారి ఆశీర్వాదములు తీసుకుని మదన్ మద్రాసు వెళ్ళి ఇంజనీరింగు కాలేజీలో సీటుకు డబ్బు కట్టి క్లాసులకు హాజరవుతున్నట్లుగా మేనమామకు జాబు వ్రాశాడు.

ప్రతిరోజూ కాలేజీకి వెళుతూవుండడం జాగ్రత్తగా చదువుకుంటూ కష్టపడి మంచి మార్కులతో ఇంజనీరింగు

మొదటి సంవత్సరము పేసయ్యాడు. రెండవ సంవత్సరము చదువడానికి గట్టి చిక్కు వచ్చేటట్టువుంది. వేసంగి సెలవులు ఇచ్చేశారు. ఒకరోజు ఉదయాన్నే మదనగోపాలు ఇంజనీరింగు కాలేజీనుంచి కాలినడకను బయలుదేరాడు. చాలాదూరము వచ్చేసరికి దాహము వేసింది. అప్పటికి సుమారు పదిగంటల ఇరవై నిమిషాలు అయినది. ఏప్రిల్ నెల కాబోలు ఎండ బాగా ఎక్కువగా వున్నది. పాపం మొహానికి ఎండ. వేడిగాలి తగిలి చాలా వాడిపోయింది. ఎక్కడన్నా మంచినీళ్ళు దొరుకు తాయేమోనని చూశాడు దగ్గరలో మంచినీళ్ళ చలివేంద్ర ములుగాని, కాఫీహోటల్సుగాని ఏమీ లేవు. అందుకు తన అంతులేని దాహం తీర్చుకొనుటకు యింకా వందగజాలు దూరం నడిచేటప్పటికి సొమ్మసిలినట్లు అయ్యాడు. కళ్ళు పెద్దవి చేసి దగ్గరగా కనుపించే అందమైన సౌధము దాని గేటుమీద ఉన్న బోర్డు చూశాడు. డాక్టరు రమేశబాబ్ ఎం. బి. బి. ఎస్. Private Medical Practitioner పన్నవాకం, మద్రాసు D. No. 11/384 అని వ్రాయబడివుంది. లోపల కెళ్ళవచ్చునో లేదో అని భయపడుతూ నెమ్మదిగా అడుగులో అడుగు వేసు కుంటూ చెట్లనీడలలోంచి నడిచి వీధిద్వారము చేరినాడు. పచ్చని శరీరము ఏమో ఎండ దెబ్బకు కందిపోయి కమిలిపోయి నట్లుగా కనుపించింది. 'ఏమండి కాసిని మంచినీళ్లు యిస్తారా' అని కంపిస్తున్న కంఠంతో పిలిచాడు. మొదటిమాట ఎవరికీ వినబడలేదు కాబోలు. తిరిగి గట్టిగా కేకవేశాడు. రెండవ మారు కేక వినిపించినది కాబోలు లోపలనుంచి "వస్తున్నాను ఎవరది ? అంటూ శా[illegible]వి తెర తొలగించుకుని వచ్చి

నిర్ఘాంతపోయింది ఆ మనిషిని చూసి. కనుబొమ్మలు, కనురెప్పలు ఆడడం తప్ప మనిషి కదలికే లేదు. "ఆ! వారే ఇలాగే వుండేవారు నా పెళ్ళికి. ఎవరీ అబ్బాయి," నేను అడగాలని దగ్గరకొచ్చి 'నాయనా! ఏం కావాలి! ఎవరు నువ్వు' అని అడిగింది. దానితో మధు అలసి తడి ఆరిపోయిన పెదవులు తడుపుకుంటూ 'కాసిని మంచినీళ్లు ఇప్పించండమ్మా', చాలాదూరమునుంచి వస్తున్నాను. బస్సు దాటిపోయింది అంటూండగానే శాంతిదేవి 'సోమాజీ – సోమాజీ – గ్లాసుతో మంచినీళ్ళు తీసుకుని తొందరగా రా' అని గట్టిగా కేకవేసింది. 'వస్తున్నాను అమ్మగారూ' అంటూ పదునెనిమిది సంవత్సరములు, మంచి చెలాకీగావున్న కుర్రవాడు ఒక్క గెంతులో గ్లాసునిండా మంచినీళ్లు తెచ్చి 'ఇవిగో అమ్మగారు' అన్నాడు తెచ్చి గ్లాసు క్రిందపెట్టాడు. వెంటనే శాంతిదేవి 'క్రింద కాదురా, ఆ చిన్నబిడ్డ కుర్రవానికి ఇయ్యి' అంది. మధు మంచి నీళ్ళు త్రాగి, నమస్కారాలు అంటూ వెనుతిరిగి వెళ్ళి పోయాడు. వెళుతుంటే అతని వీపుమీద, భుజములమీద చిరుగులు కనబడ్డాయి. 'ఎంత అందమైన కుర్రవాడు. పాపం బీదరికంతో బాధపడుతున్నట్టుగా వున్నాడు. నా తండ్రి బ్రతికివుంటే ఈపాటికి ఇదే రూపురేఖలతో వుండేవాడు కదా! విచిత్రము అంతా వారి పోలికే. వారి పోలికను బోలిన కుర్రాడులాగా వున్నాడు. ఇంతవరకు నేను ఎక్కడా ఎవరినీ చూడలేదు. ఏమి చేస్తున్నాడో! ఎక్కడ వుంటున్నాడో? అడగడం మరచి పోయాను' అని అనుకుంటూ శాంతిదేవి లోపలికి వెళ్ళి మేడ మెట్లు ఎక్కుతూవుంటే రమేశబాబు గేటుదాటి కాంపౌండు

లోకి వస్తూ కారు హారన్ వేశాడు. వెంటనే శాంతిదేవి వెనక్కు తిరిగి మెట్లు దిగి హాల్లోకి వచ్చి ఎదురుగా వస్తున్న రమేశ్ బాబుతో 'ఏమండోయి! ఇవాళ ఒక తమాషా చూశాను అంది. 'ఏమిటది' అన్నాడు రమేశ్.

'ఆ ఏమీ లేదూ! అచ్చంగా మీ పోలికతో ఉన్న కుర్రాడు ఒకడు మన ఇంటికి వచ్చాడు ఇవాళ. సుమారు పద్దెనిమిది సంవత్సరము లుంటాయి. చాలా అందంగా వున్నాడు. పాపం బీదరికంచేత బాధపడుతున్నట్లుగా కనిపించాడు. మీరు మీ చిన్నతనంలో అంటే మన పెళ్ళినాటికి ఎలాగ వుండేవారో అదేవిధంగా వున్నాడు. ఎక్కడ వుంటున్నాడో ఏం చేస్తున్నాడో అడగడం మరచిపోయాను. దాహంగా వుంది మంచినీళ్లు అడిగితే మన సోమాజీని పిలిచి ఇప్పించాను. ఎవరి పిల్లాడో?' అంటూ ఒక్కమారు శాంతిదేవి పలికింది. 'అలాగా! నేను అలాంటి కుర్రవానికోసమే తిరుగుతున్నాను. ఎంతపనిచేశావు? వివరాలు అడగలేక పోయావా' అన్నాడు నిరుత్సాహంగా బాధపడుతూ.

# 8

వేసంగి సెలవలు ఇవ్వడం జరగగానే నాలుగురోజులు ఆగి తరువాత మధు బయలుదేరి మేనమామ గారింటికి వెళ్ళిపోయాడు. మధుని వచ్చినదగ్గరనుంచి మేనమామ కేశవరావు రమేశబాబు అనే డాక్టరుగారు ఎవరన్నా కనుపించారా? అతను ఏ పరిసరాల్లో వుంటున్నాడో తెలుసునా? అంటూ అడుగుతూవుండేవాడు. మధు మాత్రం ఒకమాటు దాహం వేస్తే పక్కనవాకంలో ఎవరో రమేశబాబు అనే డాక్టరు ఇంటికి వెళ్ళి మంచినీళ్ళు త్రాగి వచ్చానని ఆయనభార్య చాలా మంచిదిగా కనుపించినదని చెప్పాడు. రోజులు గడచి పోతున్నాయి. వేసంగి సెలవులు అయిపోయి తిరిగి కాలేజీ తెరిచే రోజులు దగ్గరగా వచ్చేసాయి. మళ్ళీ కేశవరావు కొంచెము డబ్బుయిచ్చి మధుని పంపానని, మిగిలినది తరువాత పంపిస్తానని చెబుదామనుకున్నాడు. సెలవలయిపోగానే మధు మళ్ళీ మద్రాస్‌కు ప్రయాణసన్నాహమయ్యాడు. అనుకొన్నట్టుగా కేశవరావు కొంత సొమ్ము మాత్రం మధుచేతికిచ్చి మిగిలినది పదిరోజులలో పంపిస్తానని ఈ లోపల కాలేజీవాళ్ళు వత్తిడిచేస్తే ఈ సంగతి చెప్పమని అన్నాడు. మధు తిరిగి మద్రాస్‌వచ్చి కాలేజీ తెరచినరోజు హాజరయి కాలేజీ టరమ్ ఫీ కొంతగట్టి మిగిలినది పదిరోజులలో కడుతానని ప్రిన్సిపాల్‌కు చెప్పి అతని అనుమతి పొందాడు. చాలా తెలివైనకుర్రాడు అగుటవలన ప్రిన్సిపాలు మధు పరిస్థితిని కొంచెం అర్థము చేసుకున్నాడు. పాపం అతనికి ఏదన్నా స్కాలరుషిప్ ఇప్పించేందుకు ప్రయత్నము చేద్దామని అనిపించింది. అందుకని

ప్రిన్సిపాలు సాగరచంద్రసేన్ M. A. Phd తన కాలేజీ కమిటీ మీటింగు ఒకదాన్ని ఏర్పాటుచేసి అందులో తెలివిగలిగి మంచి మార్కులువస్తున్న విద్యార్థులకు స్కాలరుషిప్పులు రెండు మాత్రము ఇవ్వవలెనని వున్నదని తన అభిప్రాయము చెప్పి వారందరిని ఒప్పించారు. చివరకు మొదటి టరమ్ కాలేజీ ఫీ పూర్తిగా ఓ కుండానే మధుకు కాలేజకమిటీవారు సంవత్సరానికి అయిదు వందల రూపాయలు ఇచ్చేటట్టుగా స్కాలరుషిప్పు ప్రసాదించి, ఇప్పటికంటే ఇంకా మంచి మార్కులతో ఇంజనీరింగు పరీక్షలు పేసవుతే మంచి పరిస్థితికి సహాయము చేస్తామని హెచ్చరించి ప్రోత్సహించారు. మధు చాలా సంతోషించి మేనమామకు వెంటనే ఈ సంగతి తెలియపర్చాడు జాబుద్వారా. కేశవరావు సరోజకూడా చాలా సంతోషించారు మధు తెలివి తేటలకు ఆతని మంచి భవిష్యత్తుకు, భగవంతుని గూర్చి ప్రార్థనలు చేసారు. స్వార్థాన్ని విడిచి త్యాగాన్ని చేయడంలోగల తీయదనం అనుభవించేవారికేగాని 'ఏ ్దుకేమి తెలుసురా అటుకులరుచి' అన్నట్లుగా ఇతరులకేమి తెలుసు, అటువంటి మంచికోవలోకి చేరిన వారయ్యారు సరోజ, కేశవరావులు. వారి బిడ్డకూడా పెరిగి పెద్దవాడవుతున్నాడు గాబట్టి మంచితనముగా వుంటే రేపు ఇంజనీరు పేసయి పెద్దఉద్యోగిగా వచ్చినమధు తప్పక సహాయముచేస్తాడు అనే గట్టి ధీమా సరోజ కేశవరావులకు వున్నది. చిన్నతనమునుంచి అల్లారుముద్దుగా ప్రేమతో పెంచిన మదనగోపాల్ వారి నెప్పుడు కాదనడని వారి తలంపు. అందుకే కేశవరావుకూడా తాను వృద్ధుడనగు చున్నందువలన

కొంచెము సహాయత అనేది మధు పెద్దవాడై ఒక ఉద్యోగిగా మారిన తరువాత తన బిడ్డకొరకై సహాయమపేక్షించినాడు. అది సహజమే గదా ?

అక్కడ మద్రాస్‌లో రమేశబాబు వెదికినంతవరకు స్కూల్సు, అనేక అనాథ ఆశ్రమములు, హోటల్సు లాడ్జిలు వెతికి చివరకు చాలా నిస్పృహ చెందాడు. తను చేసిన పనికి కల్యాణి ఏమైపోయిందో. ఆ కడుపునబుట్టినవాడు ఏమైనాడో అనే ఆలోచనత, భీతి కలిగినది. రమేశబాబుకు ఒక రోజు కాలేజీలు అన్నీ గాలిద్దామని ఎక్కడనున్నా తనన్నగాని కల్యాణినిగాని పోలిన కుఱ్ఱవాడు కనబడితే వాడిని కొన్ని ప్రశ్నలువేసి సంగతి సందర్భాలు తెలుసుకోవలెనని ఆలోచించాడు. ఆరోజు ఆదివారము వెళ్ళి సోమవారం వచ్చింది. స్కూలు కుఱ్ఱాళ్ళు కాలేజీ కుఱ్ఱాళ్ళు అందరూ పదిగంటలవేళ కాలేజీలకు స్కూళ్ళకు పోయే ప్రయత్నములో వున్నారు. ట్రాముబండ్లు నిండా విద్యార్థులే, బస్సులనిండా విద్యార్థులే. రమేశబాబు గూడా తన డ్యూటీసంతను Compounder శ్రీశైలానికి అప్ప చెప్పి తానుగూడా ఈ విద్యార్థులను వెంటాడడము మొదలు పెట్టాడు. తాను చదువుకున్నవాడినని, ధనవంతుడనన్న సంగతే మరచిపోయాడు. తనకారు వేసుకుని తిన్నగా ప్రసి డెన్సీకాలేజీ, పచ్చయప్ప కాలేజీ, త్యాగరాయ కాలేజీ తాంబరంలోనున్న క్రిస్టియన్ కాలేజీ మొదలైన ఆర్ట్సు కాలేజీ లన్నీ తిరిగినాడు ఎక్కడ తాను అచ్చంగా తనపోలిక కల్యాణిల పోలిక గల విద్యార్థి కనిపించలేదు. చివరికి మిగిలినది ఒక్క ఇంజనీరింగు కాలేజీ తప్ప తక్కినవన్నీ జూడడమైనది. ఇంజ

నీరింగు కాలేజీ గిండిలోగదా రేపు పోవచ్చును అని అను కుంటూ కారుమీద ఇంటికి వచ్చేశాడు. మేడ మెట్లు ఎక్కుతూ వుంటే శాంతిదేవి లోపలినుంచి వచ్చి 'ఏ మండోయి ఆ రోజు నుంచి నీళ్ళు తాగి వెళ్ళిన కుర్రాడు ఈ వేళగూడా వచ్చి తనకు వంట్లో బాగుండలేదనియు డాక్టరుగారిని ఒకసారి కలుసుకుందామని వచ్చాననియు చెప్పాడు. మీ కొరకు ఒక అరగంట చూశాడు ఆతనితోకూడా ఒక పెద్దమనిషి ఎవరో వున్నాడు అందువలన నేను అతనికెదురు పడి ఏమీ అడగ లేకపోయాను. భగవంతుని సృష్టి అద్భుతముగదా ? మిమ్మ లిని చూసినా, అతనిని చూసినా ఇద్దరూ ఒక్కమాదిరిగానే వున్నారు. తప్పక అతను మీ కొరకు రేపుగాని, ఎల్లుండిగాని సాయంత్రము ఆరుగంటలకు వస్తానని చెప్పి వెళ్ళాడు. పాపం బీదవానివలె వున్నాడు కాని వాని కళ్ళు జ్యోతులమాదిరిగా అతి తెలివిగా ప్రకాశిస్తున్నాయి. అందమైన మోము, పచ్చని ఛాయ. ఆతనిని చూసిన దగ్గరనుంచి మనము తెచ్చి పెంచు కుంటే బాగుంటుంది. అతని కెవ్వరైనా వున్నారో లేదో కాని నాకు మాత్రం మాతృవాత్సల్యం కల్గుతున్నది ఆతనిమీద మీరు రేపు తిరగడంమాని అతని కొరకు సాయంత్రము ఆరు గంటలకు కాసుకు కూర్చోండి' అని శాంతి గడగడా కాఫీ త్రాగినట్లుగా చెప్పింది. చాలా సంతోషపడ్డాను. అతనే కల్యాణి పుత్రరత్నము. తప్పక నా తండ్రే అయివుండాలి. విధి దుర్విధిగా నా బిడ్డను నాకు కాకుండా చేసిందిగదా !' అను కుంటూ తిరిగి వచ్చిన అలసటను కుర్చీలో పడుకుని మరునాటి సాయంత్రము వరకు పగటి కలలు కంటూ తన పితృప్రేమ

హృదయంతో, బాధతో, ప్రేమతో ఎదురుతెన్నులు చూస్తు న్నాడు. మరునాడు సాయంత్రము ఆయిదుగంటలవరకు ఎక్క డికి వెళ్ళకుండా రమేశబాబు అతని డిస్పెన్సరీలోనే కాలం గడిపేశాడు. హాల్లోకొచ్చి తను గోడను వ్రేలాడదీసిన ఫొటో గుడ్డతో తుడిచి కల్యాణి ముఖాన్ని పరిశీలిస్తూ కూర్చున్నాడు. ఇంతలో ఆరుగంటలయినది. రమేశబాబుకు ఆతురత, పితృ వాత్సల్యత, వస్తాడో రాడో, అనే తహతహా ఎక్కువై ఆయి పదిమార్లు వీధిగేటుదగ్గరకు, ఇంటిలోనికి తిరిగాడు. జగత్సృష్టి వైపరీత్యము తండ్రి, బిడ్డలు స్పర్శకలిగేటంతవరకు, చూసేంత వరకు ఈ విధమైన తీయని అనురాగ ప్రవాహంలో వూగి పోతూనే వుంటారుకదా! వారిదే విడివడని బంధము ఆత్మీ యత గదా! 'కల్యాణీ నిజంగా నీ బిడ్డయేనా! ఎంత దుర్మా ర్గము చేశాను. క్షమించు కల్యాణీ, నా బిడ్డను నాకు వప్ప గించడానికైనా రాలేకపోయావు. నిజమే దుర్విధి. ఇప్పుడు నేను విచారిస్తేమాత్రం ఏమి లాభము. తప్పుచేసిన వానిని ఈ విధంగా దండిస్తున్నావు. నా బిడ్డను చూసుకునే భాగ్యం ఇంత వరకు కలుగ చేయలేదు. ఇక ముందైన నా బిడ్డను చూసేం దుకు మార్గమేర్పరచుము కల్యాణీ, అంటూ కళ్ళకొలకులలో నిల్చిన నీరు రుమాలుతో వత్తుకొని తల పైకెత్తి చూసాడు. ఎదురుగా వీధి గుమ్మముదగ్గర ఎవరివో పాదాల అలికిడి విన్పించినది. 'ఎవరువారు' అన్నాడు 'నేనే బాబూ' అంటూ పంతొమ్మిది సంవత్సరాల పసందైన కుర్రాడు రమేశబాబు కెదురుగా నిలిచాడు. చిన్న బల్బుహాలులో వెలుగుతూండడము వలన రమేశబాబు శాంతిని కేకవేసి పెద్దలైటు వెయ్యమంది

వెయ్యమన్నాడు. కుర్చీలోంచి లేచి కుర్రాడిదగ్గరగా రావడం, పెద్దలైటు వెన్నెలకాంతిగా వెలగడం ఒకే మారు జరిగాయి. రమేశబాబు రక్తం పొంగింది. అశ్రుధారలు ఏకధారలై ప్రవహించాయి. హృదయం వేగంగా కొట్టుకుంటుంటే గుండె చేతితో పట్టుకుంటూ 'నాయనా ! నువ్వు ఎక్కడ వుంటున్నావు. నీ పేరు ఏమిటి దగ్గరకురారా ! అని పిల్చాడు. తన ప్రక్కనేవున్న కుర్చీలో అతన్ని కూర్చుండమని శాంతిని కాఫీ, ఫలహారములు తెమ్మన్నాడు. ఈ మర్యాదకు మధు చాలా గాబరా పడ్డాడు. రమేశబాబు దగ్గర కూర్చుండడానికి మధు భయపడి లేచి నిలబడ్డాడు. వానిని చూస్తూవుంటే రమేశబాబుకు కల్యాణీ సామీప్యమున వుంటే ఎంత హాయిగా వుండేదో అంత వాత్సల్యత కలిగి, ప్రియముగా వున్నది. అక్కడ భార్య ఇక్కడ పుత్రుడుగా రెండు ఎక్కువయే గదా. తిరిగి రమేశబాబు 'నీ పేరు ఏమిటోయ్' అని ప్రశ్నించాడు. 'నన్ను మదన గోపాల్' అంటారండి.

'ఇక్కడ ఏమిచేస్తున్నావు, నాయనా' అంటూ తిరిగి అడిగాడు.

"గిండీలో ఇంజనీరింగు రెండవసంవత్సరము చదువుతున్నానండి" అన్నాడు. ఇంతలో శాంతిదేవి నవ్వుతూవచ్చి నేను చెప్పలా తప్పకుండా ఈరోజు వస్తాడని, నాకు ఎందుకో అంత నమ్మకము వుంది' అంది.

'మధూ' అని పిలవనా అన్నాడు రమేశబాబు.

'మీ ఇష్టం' అన్నాడు తిరిగి 'నన్ను అందరూ మధూ అనే పిలుస్తారు.' మామామయ్యా, మా వాళ్ళందరూ అంతే

నండి' అన్నాడు.

ఇంతలో శాంతిదేవి కాఫీ, ఫలహారము చల్లారతాయని ఇద్దరకు దగ్గరలో వుంచింది. తాను లోపలికి మరేదో తీసుకురావడానికి వెళ్ళింది. రమేశబాబు మధు తనబిడ్డడేనా ఎలాగ తెలుసుకునేది. దానికి నిదర్శనము ఏమిటి అంటూ మధుకు దగ్గరగా జరిగి బుగ్గలమీద ముద్దుపెట్టుకున్నాడు. ఆతనికి మహదానందము కలిగినది. పితృప్రేమ పొంగి పొరలినది. రక్తము వేడిగా ప్రవహించినది. ఇంక ఆనంద ఉద్రేకములను ఆపుకోలేక ఎదురుగావున్న మధుని గట్టిగా కౌగలించుకొన్నాడు. పుత్రప్రేమవుంటే తండ్రి ఎంత లాలనచేస్తాడో అంత లాలనచేస్తూ మధుని ఉక్కిరిబిక్కిరి చేసేశాడు. మధు కొయ్యబారిపోయి సిగ్గుపడ్డాడు తనెవరు ఈ జమీందారు డాక్టరు ఎవరు. తనకీ ఈయనకీ సంబంధము ఏమిటి ఈయన ఇంత పిచ్చిగా ఆప్యాయితగా ప్రవర్తిస్తున్నందుకు కారణమేదో వుంటుంది. వచ్చివెళ్ళిన ఆమె ఈయన ధర్మపత్నికదా! మరి నన్ను ఇరువురు ఎందుకు ఈవిధంగా చూస్తారు. భగవంతుని లీలలు అద్భుతములుగదా అనుకుంటూ ఆలోచిస్తూంటే రమేశబాబు బలవంతముచేత కాఫీ కొంచెము త్రాగి, టిఫిన్ వద్దని వదలివేశాడు, కొంచెముసేపటికి లేచి నమస్కారములుచేసి మళ్ళీ ఆదివారమునాడు వస్తాను బాబూ చాలా ప్రొద్దుపోతోంది నడిచి వెళ్ళాలి అన్నాడు.

'ఎక్కడికి వెళ్ళాలోయ్' అని అడిగాడు రమేశ్ బాబు.

'గిండీ వెళ్ళాలండీ'

'మరి బస్సుమీద వెడితేమంచిదిగదూ మైలాపూరు వెళ్ళి అక్కడనుంచి గిండీబస్సు ఎక్కు నడచి ఎందుకు నాయనా రాత్రివేళ' అన్నాడు ఆప్యాయంగా.

'తొందరగా రావడంలో పర్సు మరచిపోయాను సార్' అన్నాడు సిగ్గుపడుతూ. రమేశబాబుకు మధును చూసినకొద్దీ పరిశీలించినకొద్దీ కల్యాణి ముఖలక్షణాలు, ఆమె రూపు రేఖలు కనబడ్డాయి. ఏమైన ఈతని జీవితరహస్యం తెలుసుకోవాలని ఆదివారం వరకు తొందర పడకూడదని ఈకుర్రాడు తిరిగి భయపడి రాకుండా పోతాడేమోనని ఆలోచించి.

'ఇంద తీసుకో, నడిచివెళ్ళకు నాయనా' అంటూ అయిదురూపాయల నోటు అతని చేతిలో పెట్టబోయాడు. మధు 'వద్దండి నేను పోగలను నాకు అలవాటే' అంటూ రెండు అడుగులు వేసాడు. రమేశబాబు భయములేదని, తప్పుగాదని వప్పించి తీసుకోమని మధు చేతిలో డబ్బు వుంచాడు. ఆ సమయంలో మధుకు ఆతని స్పర్శతగిలేసరికి శరీరము అదొక రకముగా అయి ప్రేమప్రవాహము పొంగి పొరలినది. కళ్లు చెమ్మగిల్లినాయి. తనంటే తన మామయ్యతప్ప ఇంకొకరు కూడా ఇంత ప్రేమించేవారున్నారా? అనుకున్నాడు. రమేశబాబు కాళ్ళకు వంగి నమస్కరిస్తూ లేచి నిలబడేసరికి మధు కండ్లలో నీరుతిరిగింది. ఇంతలో శాంతిదేవి దగ్గరకువచ్చి ఏమిటినాయనా వెళ్ళిపోతున్నావా ఈపూటకు ఇక్కడవుండు ప్రొద్దుటే వెళుదువుగాని' అంది. రమేశబాబుగూడా అన్నాడు ఏమైనాసరే వుండేందు కొప్పుకోక మధు ముక్తసరిగా మూడే మాటలు 'మళ్లీవస్తానులేండి' అంటూ వీధిగడపదాటి

గేటుగుండా గబగబానడిచి వెళ్ళాడు. రమేశుబాబుకు మధు యొక్క ఆకృతి, అతని సంపూర్ణ పరిష్వంగము ఎంతో తృప్తి నిచ్చాయి. తప్పకుండా ఇతనే తనకొడుకు, కల్యాణిరక్తమే యు మనస్సు ఆక్రోశించినది. అతను వెళ్ళినవైపే చూస్తూ చాలా సేపు అలాగునే వుండిపోయాడు. ప్రక్కనున్న శాంతి 'అదేమి టండీ మరీ చిన్న పిల్లవాడవుతున్నారు లేవండి మేడమీదకు వెళదాము. వెన్నెల బాగావచ్చింది. ఆదివారం మళ్లీ వస్తా నన్నాడుగా? పోనీ ఆతన్ని ఇక్కడనేవుండి చదువుకోమనండీ మనఇంట్లోమాత్రం ఎవరున్నారు. కుర్రాడు చాలా బుద్ధి మంతుడిగా కనపడుతున్నాడు. పాపం తల్లిదండ్రులెవరో, అంటూ భర్తను కుర్చీలోంచి లేవమని హెచ్చరించింది. ఆ కుర్రాడినే తల్చుకుంటూ రమేశబాబు, శాంతిదేవి ఆరాత్రి అంతయు గడిపారు. తిరిగి ఆదివారం వచ్చేసరికి రమేశబాబు ఆకుర్రాడికి రెండు సూట్లకు సరిపడ్డగుడ్డలు ఖరీదయినవి కొని తీసుకువచ్చాడు ఒక ఖరీదైన రిస్టువాచీ ఒక బూట్లజత ఒక డజను చేతిరుమాళ్లు అన్నీ తెచ్చాడు. ఇవి కొంటుంటే తనబిడ్డకు కొంటున్నట్టే సుఖానుభూతిని పొందాడు అవన్నీ ఎరుగకుండా పెట్టుకుని మధు ఎప్పుడువస్తాడు. ఎప్పుడు ఇవన్నీ వేసుకుని తనేదుట కనబడుతాడు. తిరిగి తాను అతనిని ఎప్పుడు కౌగిలించుకొని ముద్దుపెట్టుకుంటూ హృదయానికి హత్తుకొంటాను' అనుకుంటూ కమ్మని కలలను రోజూ కంటూ వుండేవాడు. శనివారం గడిచింది. ఆదివారం కూడా సగం గడిచింది. ఆరోజు పన్నెండుగంటలవరకు రమేశబాబు, శాంతిదేవి భోజనాలు చేయకుండా మధుకోసం కనిపెట్టుకుని

వున్నారు. ఎందుచేతనో మధురాలేదు. అతని కేమి జరిగినదో ఎలావున్నాడో, కారువేసికొని ఇంజనీరింగు కాలేజీవేపు వెళ్లి రానా? అనుకుంటూంటే శాంతి 'పోనీ కారుమీదవెళ్లి ఒక్క మారు చూసిరండి' అంది దాంతో రమేశబాబు నిజంగా కంగారుకలిగి కారువేసుకుని ఇంజనీరింగు కాలేజీవైపు మధ్యాన్నం పంటిగంట వేళ బయలుదేరాడు. తిండి తిప్పలు తనకుకూడా లేవు. మనస్సు మధును చూసేటంతవరకు అల్లల్లాడిపోతున్నది. ఇంజనీరింగు కాలేజీ సమీపానికి వచ్చేసరికి ఇద్దరు కుర్రాళ్లు కనపడ్డారు. కారు బ్రేకువేసి ఆపి వాళ్లను దగ్గరకుపిలిచి మదనగోపాల్ అనే ఇంజనీరింగు విద్యార్థి ఏ నెంబరుగదిలో వుంటాడు. హాస్టల్లో వుంటున్నాడో బయట వుంటున్నాడో అడిగాడు. వారు వెంటనే 'పాపం నిన్న సాయంత్రం మధూ అనే రెండవసంవత్సరము విద్యార్థి మౌంటు రోడ్డులో ఒకలారీక్రింద పడ్డట్టుగానూ అప్పుడే కాలేజీ ప్రిన్సిపాలుకు పోలీసులు ఫోనుచేస్తే వెళ్లి జనరల్ హాస్పటల్‌లో చేర్పించట్లును వారు ఇప్పుడు ఆసుపత్రికే అతనిని చూచుటకు వెళుతున్నామని చెప్పారు. దానితో రమేశబాబుకు కళ్లు చీకట్లు క్రమ్మాయి. తలతిరిగింది, ముచ్చెమటలు పోసాయి. కళ్ళనీళ్లు తిరిగి పాకెట్ కు తన్నుకుని తనకు ఈ ఆశలుకూడా గాలి మేడలు అవుతాయా! అనుకుంటూ బాధపడుతున్నాడు. భగవంతునికి చేతులెత్తి మ్రొక్కుతున్నాడు. మనస్సులో ఆ చిరంజీవిని కాపాడమని అనేకసార్లుగా మననం చేస్తున్నాడు. తన బిడ్డగానే తలుస్తూ ఎంతో బాధపడుతున్నాడు. వెంటనే వారిని గూడా తనకారులో రమ్మనమని ఆసుపత్రికి తిన్నగా వెళ్లారు.

కాని ఆసుపత్రి గేటు సాయంత్రము నాలుగుగంటలకుగాని తెరువరని, ఏమైనాసరే ఎవ్వరికి పర్మిషన్ లేదు అన్నాడు గేటు ఉద్యోగి. దాంతో రమేశబాబు తాను డాక్టరునని చాలా అర్జంటు పనిమీద ఒకరోగిని చూడటానికి వచ్చానని చెప్పాడు. ఆసుపత్రి సూపరింటెండెంటు పేరు చెప్పాడు. దానితో గేటు నౌకరు తలుపుతీసాడు. రమేశబాబు తిరిగి కాంపౌండులోనుంచుని లోపలికి మధు స్నేహితులతో వెళ్లిపోయాడు. ప్రపంచములో అందుకే రక్తస్పర్శ యొక్క మహత్త్వమైనశక్తి ఏ విధంగా ప్రతిఫలిస్తూంటుందో మానవశరీరాలకు మన ప్రవృత్తులకు వుండే మార్పులు, సన్నిహిత సంబంధములు అన్నీ భగవంతుడు కర్మాకర్మల గుణసంకుచిత ప్రారబ్ధములయొక్క పొందికగా కనబరుస్తూ నిరూపిస్తూ వుంటాడు. 'నీళ్లుకొడితే రెండు అవదు, బొలుకొడితే రెండు అవుతుంది కదా' అనే లోకసామెతగా రమేశబాబుకి మధు తన పుత్రుడు అని నిజంగా తెలియక పోయినను ఏదో ఒక అవ్యాజమైన ప్రేమకు తన మనస్తత్వము ననుసరించి కంపించిపోతున్నాడు. అతనిని చూసినప్పుడు కల్యాణీ ముఖము, ఆమెమాటల ధ్వని అని పిస్తూ వుంటుంది. ప్రేమ ప్రజ్వరిల్లి రక్తస్పర్శయొక్క శక్తిని బట్టి మనోవేదనకలిగి మధును తన కుమారునిగానే తలంచుతున్నాడు రమేశబాబు. శరీరము ఆనందంలో, అలసిపోయి మన శరీరానికి చల్లని పిల్లవాయువులు వీచితే, తాకితే ఏవిధంగావుంటుందో ఆ విధంగానే మునిగి తేలుతోంది అతని మనస్సుసహజప్రేమల అనుభూతియొక్క శక్తి ఇదేకదా? తండ్రి కుమారులు అని పూర్తిగా తెలియకుండగనే వారిద్దరిలో

సహజమైన తండ్రీ కుమారులయొక్క ఆత్మసంబంధము వెల్లి విరిసింది. అదే భగవంతుని సృష్టిలో కలసివచ్చే మార్పు. ఏది సత్యమైనదో అదే శాశ్వతమైనదికదా! అందులో పితృ వాత్సల్యము, మాతృప్రేమ సోదర, సోదరీలకుండు సహజ ప్రేమ వాటంతట అవే తెలియరాని మార్పులతో మనస్సును పేరేపిస్తాయి. రక్తస్పర్శకు సాటిలేనిదేదీ ప్రపంచములో లేదు. లేదు. లేదు. ముమ్మాటికీ నిజము. ఎందుకంటే సత్యమైనది శాశ్వతమైనదే గదా! బహుసుందరముగా కనుపట్టు ఈ ప్రపంచవలయము భగవంతునియొక్క చేష్టలతో పరిభ్రమించుచుండును, అదే సృష్టి, స్థితి, లయకారములు. సత్యం, శివం, సుందరం అను మూలప్రకృతియొక్క స్తంభములుకదా!

# 9

ఒకరోజు మధు లారీక్రింద పడ్డాడనే వార్త తెలియగానే ఇంజనీరింగు కాలేజీ ప్రిన్సిపాలు మధు మేనమామ ఎడ్రస్‌కు వెంటనే రమ్మనిమని ఆసుపత్రిలో మధును చేర్చామని చాలా బలమైన గాయము తలకు తగిలిందని తంతి ఇచ్చాడు. దానితో కేశవరావు సరోజలు చాలా విచారించి వెంటనే తమదగ్గర డబ్బు లేకపోయినను సరోజ తన బంగారు గాజులు తాకట్టుపెట్టి ఆతనిమీద ఉండే వాత్సల్యంతో మద్రాస్ బయలుదేరి వెళ్ళిపోయారు. రాగానే ప్రిన్సిపాలు గారికి ఫోన్ చేస్తే ఒక విద్యార్థిని సరాసరి సెంట్రల్ స్టేషన్‌కు పంపించారు. అతని సహాయంతో కేశవరావు, సరోజలు మధు వున్న వార్డును చేరుకున్నారు ఆసుపత్రిలో వారు వెళ్ళి చూసేసరికి మధుకు స్పృహరాలేదు. ఇంకా తెలివి వచ్చేందుకు రెండుగంటలు పడుతుందనీ ఉదయం తొమ్మిది గంటలకు ఆపరేషన్ చేశారని, భయము లేదన్నారని చెప్పారు. కేశవరావు భగవంతునికి నమస్కరించి మధుకు ఎప్పుడు తెలివి వస్తుందా? ఎప్పుడు చూస్తానా? అనుకుంటూ సరోజ తను ఒకరి ముఖాలు ఒకరు చూసుకుంటూ కల్యాణి బిడ్డను కాపాడమని భగవంతుని ప్రార్థిస్తున్నారు, అటువంటి సమయంలోనే రమేశబాబు మిగతా ఇద్దరు విద్యార్థులు లోనికి ప్రవేశించారు. రమేశబాబు ఆతరత, ఆప్యాయత, ప్రేమ ప్రవహించుచుంటూ నాయనా మధూ, ఎలాగవుంది? ఎంతపని జరిగిందోయీ' అంటూ కనుకొలకుల్లో జారిన కన్నీళ్ళను తుడుచుకుంటూ మంచము దగ్గరకు వచ్చాడు. మనిషి పగలంతా కష్టపడి అలసి

నట్లుగా వున్నాడు. తిండి తినకుండా బయలుదేరడం, మన స్సులో వడిదుడుకులకు రమేశబాబు ముఖం చూస్తే అక్కడి వారందరికి జాలికలిగింది. మొదట రమేశబాబును కేశవరావు గుర్తుపట్టలేకపోయినాడు. మీా రెవరండీ అంటే మీా రెవరు అనే ప్రశ్న ఒకదాని వెంబడి దొర్లిపోతూ చివరకు కేశవరావు తాను మధుయొక్క మేనమామయగు కేశవరావునని తనకు నిన్న ప్రిన్సిపాలు ఇచ్చిన తంతిని చూసుకుని నిన్న మెయిలులో బయలుదేరి ఈవాళ ఇప్పుడే వచ్చానని చెప్పాడు. తాను రమేశబాబును పోల్చినాడుకాని మౌనంగా మాత్రం ప్రవర్తించ దలచుకున్నాడు. ఆతనికి పూర్వ చరిత్ర అంతా కళ్ళకు గట్టి నట్లుగా జ్ఞప్తికి వస్తోంది. సరోజకూడా రమేశబాబును పోల్చింది. ఆతని ప్రస్తుత పరిస్థితికి మరేమీా మాట్లాడకుండా తన భర్త ప్రక్కన కుర్చీ చూపించి కూర్చోమని సైగచేసింది. రమేశబాబుకు కూడా క్రమేణ సరోజ, కేశవరావులయొక్క రూపములు మారడంవలన వెంటనే పోల్చుకోలేకపోయానని తన్ను క్షమించమని కోరాడు. వాళ్ళందరూ మధుకి తెలివి వచ్చేవరకు ఆతురతతో, ప్రాణాలన్నీ బిగపట్టి ఊపిరి గట్టిగా పీలిస్తేకూడా వినబడేటంత నిశ్శబ్దతతో ఎదురు చూస్తున్నారు. మధ్యాహ్నం మూడు గంటలకు క్రమేణా మధుకు కొంచెం తెలివిరావడం మొదలెట్టింది. నెమ్మదిగా కళ్లు తెరిచాడు. ప్రక్కనున్న మామయ్య కేశవరావును చూడగానే కండ్లలో నీరు నిలచింది. కేశవరావు నాన్నా మధూ ఎలాగ వుందీ! అత్తయ్య వచ్చిందిరా! ఇదిగో కళ్ళు తెరు' అంటూ సరోజను పిలిచాడు. సరోజకు కళ్ళనీరు ఉబికింది, చీరకొంగుతో కళ్లు

తుడుచుకుంటూ అతి ఆప్యాయంగా మధు చేతిని పట్టుకుని 'నాయనా! ఎంత అదృష్టవంతులమురా' ఇంతటి ఘోరమైన ఆపత్తు ఎలాగ వచ్చిందోయ్; భగవంతుని దయ యింకా వున్నది కాబట్టి మంచి జరిగింది! అంటూ దగ్గర కూర్చున్న సరోజను చూసి ఒక నర్సు వచ్చి 'మాట్లాడించకండమ్మా. అతనిని కొంచెము పాలుత్రాగి పడుకోనివ్వండి. అతనికి పూర్తిగా చాలాకాలం విశ్రాంతికావాలి! అంది. పాలు గ్లాసులోపోసి తెచ్చి మధుకు అందించింది. నర్సు తలవైపు కుడివేపు బాగా దెబ్బ దగిలి ఒక ఎముక కొంచెము సడలిన దని దానిని ఆపరేషన్ చేసి సర్దినారని భయములేదన్నారని విద్యార్థులు రమేశబాబుకు, కేశవరావుకు చెప్పారు. ఇంక రమేశబాబు తాను మధును చూడడానికి యెంత ఆతురతతో వచ్చాడో అంత తొందరపాటు తృటిలో అణగిపోయినది. మధుకు తను తండ్రినని కేశవరావు చెబుతాడో చెప్పడో? ఒకవేళ కేశవరావు చెప్పకపోయినట్లయితే కల్యాణి ఈ బిడ్డను తను తప్పక రమేశబాబు వల్లనే కన్నానని తెల్పినదో లేదో, అది తెలిసేటంతవరకూ తానుకూడా తేలిపోకుండా మధుని వూరికే పరిచయమున్న వ్యక్తిలాగా పలుకరించి వెళ్దామని లేచి నిలబడ్డాడు కుర్చీలోంచి. అంతవరకు మధు ఈతనిని గుర్తుపట్టలేకపోయాడు. రమేశబాబు దగ్గరకు వచ్చి 'మధూ! ఈరోజు వస్తానన్నావు, రాలేదేమానని మీ కాలేజీవైపుకు వెళ్ళాను. ఎందుకు రాలేదోనని ఇంతలో ఈ విద్యార్థులు సంగతి అంతా చెప్పి ఇక్కడకు తీసుకువచ్చారు. నీకు ఇక్కడ బాగుండలేదు. నేను పెద్ద డాక్టరుతో మాట్లాడి స్పెషల్

వార్డులో మంచిప్రక్క ఏర్పాటు చేయిస్తాను. అధైర్యపడకు అంటూ కేశవరావు దగ్గర సెలవు తీసుకుని రెండుమూడ్లు వెను దిరిగి చూస్తూ రమేశబాబు పాపం వెళ్ళిపోయినాడు. కేశవ రావు, సరోజలు ఒకరి కొకరు ఏదో మాట్లాడుకుని భగవంతుని వైచిత్రమునకు ఆశ్చర్యపోతూ ఈ రమేశబాబు సహవాసము ఎప్పటినుంచి కలిగినదని మధు నడిగారు. మధు ఈమధ్యనే అని జరిగిన సంగతి అంతయు చెప్పాడు నెమ్మదిగా! కేశవ రావుకు తన చెల్లెలు బిడ్డను, వానిచేతిలోనున్న సంచీలో పెట్టిన రెండు ఉత్తరాలలో ఒక ఉత్తరములో మధు రమేశ బాబు బిడ్డ. నాకు అన్యాయము చేయవద్దు. అన్నయ్యాలూ ఇతడే, ఇతడే రమేశబాబు బిడ్డ ఆతని వంశాంకురము' అని రాసిన రాతలు జ్ఞప్తికి వచ్చి కేశవరావు కళ్ళు తుడుచు కున్నాడు. భగవంతుడు కూడా చివరకు సత్యాన్ని దాచలేడు గదా ? ఎక్కడ రమేశబాబు, ఎక్కడ మధు వారి కలయిక అపూర్వమైన ఆదర్శముకదా! ఒకరి కొకరికి తండ్రి కొడుకు లని తెలియదే. తెలియకుండా వారిద్దరు ఇంతబాధ పడుతూ వుంటే తెలిసిన తరువాత వారి ప్రేమ ఎంత పెరుగుతుందో అనుకుంటూ అవసరము వచ్చినప్పుడు కల్యాణి లేఖతో మధుని రమేశబాబు కన్నబిడ్డగా అప్పగించి ఈ జన్మలో తాను చేసిన త్యాగాన్ని, ధర్మాన్ని శాశ్వతమైనదానినిగా చేసుకుందా మనుకున్నాడు. ఇంతలో ఎవరో యిద్దరు నర్సులు వచ్చి స్ట్రెక్చరుమీద మధుని పడుకోబెట్టి స్పెషల్ వార్డులో అయిదవ ప్రక్కమీదకు మార్చమని డాక్టరు రమేశబాబుగారు ఆజ్ఞ రిచ్చారని చెప్పి మధును తీసుకుని వెళ్ళినారు. మధు వెనకాలే

సరోజ, కేశవరావు, విద్యార్థులు అందరు స్పెషల్ వార్డుదాకా వెళ్ళారు. విద్యార్థులు మధు దగ్గర సెలవుతీసుకుని వెళ్ళి పోయారు. కేశవరావు, సరోజ మధుని కనిపెట్టుకుని కూర్చొన్నారు. సాయంకాలము ఏడుగంటలయ్యేసరికి రమేశబాబు, శాంతిదేవి ఒక టిఫిన్ కారియర్ నిండా అన్నము, కూరలు, మజ్జిగ తీసుకునివచ్చారు. కేశవరాజు, సరోజలు పరిచయమైన తరువాత శాంతిదేవి మధు దగ్గరకు వచ్చి 'ఎలాగ వుందమ్మా మధూ' అని అడిగింది మధుకు దుఃఖమాగలేదు. ఎన్నాళ్ళ నుంచో అతిచనువైన వ్యక్తి చేత పరామర్శ చేయబడితే ఎంత శార్ధైనా తగ్గుతుంది. అందుచేత 'కులాసాగానే వుండండి. కూర్చోండి! అంటూ మధు తన ప్రక్కమీద కొంచెము స్థలం చూపించాడు. తిరిగి 'మీరు నాకోసం చూపించే ప్రేమకు, పడుతున్న కష్టమును మీ ఋణం యెలాగ తీర్చుకోవాలోనమ్మా' అంటూంటే అతని కళ్లు తిరిగి నీళ్ళతో చెమర్చాయి. అలాగనేటప్పటికి శాంతిదేవి అతని ప్రక్కన కూర్చొని తన మాతృప్రేమను ప్రకటించుకుంటూందా అను నట్లుగా కనబడుతోంది. ఆతనిని త్వరలో పూర్తిగా ఆరోగ్యవంతునిగా చేయమని భగవంతుని ప్రార్థించుతోంది. ఇంతలో రమేశబాబు కేశవరావును ప్రక్కకు పిలిచి తను తెచ్చిన భోజనములు భార్యతో కలిసి చెయ్యమని కోరాడు. వారు భోజనము చేసేటంతవరకు తాను, శాంతిదేవి మధు దగ్గర వుంటామనియు, భయం కనపరుస్తూ అన్నాడు. ఈతను భయపడుతున్న విషయం కేశవరావు ఎక్కడ గుర్తుపడతాడో ఎక్కడ అసహ్యించుకుంటాడో ననేదే. ఈ పదునారు సంవత్స

రాలలో రమేశబాబు చాలా మారిపోయాడు. బాగా వళ్లు వచ్చింది. అతని మనోవేదనచేత కాబోలు తలవెంట్రుకలు కూడా బాగా నెరసిపోయాయి. ఇంక ఎటువచ్చి ధనాధిదేవత వడిలో వృగుతున్నాడు. ఒకవేళ కేశవరావు ఈతనికి, మధుకు సంబంధము ఏమిటి గనుకయెందుకు ఈవిధంగా సహాయము చేస్తున్నాడు ఇది అంతా నటనా లేక నిజమా' అన్న సందిగ్ధ స్థితిలో వుంటున్నాడు కాబోలు కేశవరావు.' అని రమేశబాబు ఆలోచిస్తూ చివరకు తాను రమేశబాబుగా వారిచేత గుర్తింప బడలేదు. క్రమేణా రోజులతో బాటు మధు ఆరోగ్యము కోలుకుంటూ స్పెషల్‌వార్డునుంచి మరి పదిహేను రోజులకు డిస్చార్జి చేయబడే పత్రాన్ని పొందాడు. వెంటనే కేశవరావు సరోజ మధును తమ వూరికి తీసుకువెళ్లుతామంటే రమేశ బాబు శాంతిదేవి వాళ్ళ ఇంటికి వచ్చి ఇంకా కొద్దిరోజులు మధుకు బాగా తేలికగావుండి కాలేజీకి వెళ్ళే పరిస్థితి వచ్చే వరకు ఉండమని బ్రతిమాలారు.. రమేశబాబు ఆసుపత్రిలో అయిన ఖర్చు అంతా ఆసుపత్రిలో వెంటనే చెల్లించి తన ఋణానుబంధాన్ని ప్రకటించుకొన్నాడు విధివశాన.

# 10

ఈ పరిస్థితులు ఇలాగవుండగా మధుకు మాత్రం ఏమీ అర్థమవటంలేదు. తాను ఇక్కడ ఎందుకు వున్నాడో ఇన్నాళ్లు. తన కాలేజీ చదువేమైంది. ఇప్పుడు తాను బాగానేవున్నాడే అవుతే వీరు ఇంకా ఎందుకు నన్ను పంపడములేదు. మా మామయ్య, మా అత్తయ్య ఇంకా ఇక్కడ ఎందుకు వున్నట్లు అనే ఆలోచనలతో సతమత మవుతున్నాడు. ఒకరోజు రమేశ బాబు వస్తే 'ఏమండీ నేను పూర్తిగా ఆరోగ్యవంతుడిని అయ్యాను, దయతో నన్ను మా ఇంజనీరింగు కాలేజీ హాస్ట లుకు వెళ్ళడానికి అనుమతి ఇవ్వాలి. మీరు చేసిన ఈ సహా యానికి నా జన్మలో ఏవిధంగా ఋణం తీర్చుకుంటానో' అంటూంటే ఆతని కళ్ళలో నీరు నిలిచింది. రమేశబాబుకు కూడా ఆతని మాటలు వింటుంటే ఆతని ముఖము, ఆతని చేతులు చూస్తూవుంటే కల్యాణి జ్ఞాపకానికి వచ్చింది. ఉండ బట్టలేక మధును దగ్గరగా గుండెలకు హత్తుకుని 'నాయనా తొందరేందులకు ఇది నీ ఇల్లుగానే భావించు. పోనీ ఇక్కడనే వుండు' అంటూంటే సరోజ కేశవరావులు ఇంక లాభము లేదనియు అనుకున్నారు కాబోలు కల్యాణి వ్రాసిన జాబును రమేశబాబుకు ఇచ్చారు. తలవంచుకుని నిలిచారు ఆతని ముందు. వారు ఈతనే రమేశబాబు అని ఎలాగ గ్రహించారో అది రమేశబాబుకు కూడా అర్థమవ లేదు. రమేశబాబు జాబు పూర్తిగా చదువుకుని 'నాయనా మధూ' అంటూ ఆతనిని తిరిగి తన హృదయానికి హత్తుకున్నాడు. గట్టిగా ముద్దు పెట్టు కున్నాడు. ఏమిటది మామయ్యా అంటూన్నట్లుగా తెల్లబోయి

నిలుచున్నాడు మధు. సరోజ కండ్లు తుడుచుకుంటూ 'నాయనా మధూ! ఈ రమేశబాబుగారే నిన్ను కన్నతండ్రి. మీ క్రిందిహాలులో పుస్తకాల షెల్ఫు వెనుకగా ఎవరికీ కనుపించకుండా వున్న మీ అమ్మ ఫోటో చూసి నేను ఈయనే రమేశబాబు అయివుండాలి అని గుర్తుపట్టాను. చాలా అదృష్టవంతుడివి నాయనా? చిరంజీవివై నువ్వు చల్లగావుంటే మా అందరికి సంతోషము. భగవంతుని దయవలన నువ్వు నీ తండ్రిని చేరుకోగలిగావు. విధి బలీయమైనను మంచిగాబట్టే నిన్ను ఆశీర్వదించుచున్నాను' అని సరోజ మధును దగ్గరకు తీసుకుంటూవుంటే మధు కళ్ళవెంబడి నీళ్లు అదే ధారగా కారడం జరిగింది. గబగబా క్రిందికి వెళ్ళి రమేశబాబు కల్యాణి తాను ఉన్న పెద్ద ఫోటోను తీసుకువచ్చి, మధుకు తనతల్లిని చూడమన్నాడు. అప్పుడు మధుకు మరెంత దుఃఖము పెల్లుబికి 'అమ్మా' అంటూ ఆఫోటోలోనున్న కల్యాణి ఫోటోతలాన్ని ముద్దుపెట్టుకుని కళ్ళకద్దుకున్నాడు. ఇంతలో సరోజ' విచారించకునాయనా! నీకు ఈవిధంగా దెబ్బ తగలడం, ఈ రమేశబాబుగారు, శాంతిదేవిగారి సహాయాలతో కులాసాగా వుండడం అంతా విధిబలమే. నీకు దెబ్బతగులుట వలననేకదా నువ్వు నీతండ్రిని తెలుసుకోగలిగింది. లేకపోతే మేము ఈ మద్రాసురావడం వచ్చినా ఈ రమేశబాబుగారింట్లో వుండడం సాధ్యమవుతుందా. అంతా మంచిగా జరిగినందుకు నేను మీ మామయ్య చాలా ఆనందపడుతున్నాము. నీకు కన్నతల్లికంటె కూడా మిన్నగా చూపే నీతల్లి శాంతిదేవి గారు ప్రేమ నిరుపమానమైనది. నాయనా భగవంతుడు నిన్ను

ఎల్లప్పుడు కాపాడుతూవుంటాడు. నిన్ను మా పెద్ద కుమారు నిగాభావించి నిన్ను పెంచాము చివరకు మీ మామయ్య నీ కొరకు ఎన్ని విధాల కష్టపడ్డారో నీకు తెలియదు. నాయనా అన్నీ సక్రమంగా జరిగింది కాబట్టి మనము ఎన్ని మాట్లాడు కున్నా భయము లేదు. అంటూ సరోజ మధుని బుజ్జగించుతూ వుంటే శాంతి దేవికికూడా కండ్లలో నీళ్ళు నిలిచాయి. ఆమె సరోజను దిగులు చెందవద్దని, మధు ఎప్పుడూ ఇద్దరితల్లుల ముద్దుబిడ్డయే అని' అంటూవుంటే రమేశబాబు కేశవరావులు సరోజ ప్రక్క నిలుచుని నవ్వుకున్నారు. తండ్రి పోలికలు కలిగిన మధు రమేశబాబుని ఇంకా కౌగలించుకుందామన్న ప్రేమతో లేచివచ్చి రమేశబాబు వడిలో తలపెట్టుకొని కూర్చున్నాడు. రమేశబాబుకు తాను తిరిగి తనకన్న బిడ్డను పొందగల్గినందుకు విధిని వేనోళ్ళ పొగిడాడు. అంత వరకు కేశవరావు సరోజలు ద్వేషము లేకుండా అతిగారాబ ముతో తనబిడ్డయని తెలిసినప్పటికి మధును పెంచి పెద్దచేసి నందుకు వారికి చాలా ఋణపడివున్నానని అన్నాడు. సరోజ, కేశవరావులు చూపించిన ఔదార్యానికి, త్యాగానికి లోలోన శాంతి దేవి, రమేశబాబులు చాలా అభినందించారు. వారు అంత వరకు కష్టపడి తనబిడ్డ మధుఅని తెలిసినప్పటికి అంతప్రేమగా వానికి విద్యాబుద్ధులు చెప్పించారంటే ఎంతో గొప్పవిషయ మని తెలుసుకున్నాడు. కనుక రమేశబాబు కేశవరావుకు ఇరువదివేల రూపాయలు కానుకగా అర్పించదలచాడు. మధు చేత చెక్కును మేనమామయగు కేశవరావుకు అందించాడు. కేశవరావు మొదట సొమ్మును స్వీకరించ లేదు.

'నాయనా; మధూ నాకు డబ్బు ఎందుకురా! నువ్వే కావాలిరా నాయిల్లు చిన్నబోతుంది. మావూరు చిన్నబోతుంది సెలవలకు వస్తావని ఇంక ఎవరికోరకు ఎదురుచూచేది మధూ నన్ను అప్పుడే దూరముచేయకురా' అంటూ కళ్ళనీళ్లు పెట్టుకున్నాడు. మధు మనస్సు కరగిపోయింది. మేనమామ దగ్గరకువచ్చి 'మామయ్యా నేను బ్రతికివున్నంతకాలము నేను మీవాడినే మీ సోదరిబిడ్డనే నువ్వు ఎప్పుడూ వస్తూపోతూ వుండాలి, అత్తయ్యకూడా రావాలి. సెలవులలో పిల్లలను తీసుకుని వస్తూవుండండి. ఇదే నాకోరిక ఈసొమ్ము నీకు ప్రతిఫలముగా కాదు ఇస్తున్నది నా హృదయపూర్వకమైన ప్రేమ! అభిమానముకలిగి ఇస్తున్నాను. తీసుకో అలాగు చేయకపోతే నేనేకాదు మాఅమ్మ ఆత్మకూడా బాధపడుతుంది. తీసుకో మామయ్యా తీసుకో అంటూ మేనమామ చేతిలో చెక్కును వుంచాడు. గోపీ మామయ్యకు పెళ్లి నిశ్చయించి జాబువ్రాస్తే తప్పకుండా మేమందరము వస్తామని చెప్పు. గోపీ మామయ్యను కమల్ బావను, శశిని తప్పకుండా వచ్చే సెలవులలో పంపించు అన్నాడు మధు.

మామయ్యా, అత్తయ్యలకు నమస్కరించి వారి ఆశీర్వాదములు అందుకున్నాడు. రమేశబాబు హృదయం విరిసిన పూవులతో నిండిన ఉద్యానవనము లాగవుంది. అందులో తాను కన్నబిడ్డ శశాంకురము అయిన మధు ఒక దివ్యమైన, తెల్లని పుష్పరాజము మాదిరిగా వెల్గొందుతున్నాడు. శాంతిదేవికూడా తన బిడ్డ అని చెప్పుకోగలిగిన పరిస్థితికి ఎదురు చూస్తున్నది కనుక, ఇంక తమకు బిడ్డలు లేరు అన్న చింత

వారిని వదిలివేసినది, నెలరోజులయ్యేసరికి మధు మామూలు ఆరోగ్యమును పుంజుకుని యథా ప్రకారముగా కాలేజీకి వెళ్ళి వస్తున్నాడు. కాలేజీ ప్రిన్సిపాలుగారికి మధు డాక్టరు రమేశ బాబుగారి పుత్రుడు అని తెలియగానే మరింత గౌరవము ప్రేమ ఎక్కువైనాయి. ఒకరోజున బయలుదేరి కేశవరావు, సరోజలు వాళ్ళవూరు వెళ్ళిపోయారు. రమేశబాబు, తనబిడ్డ మధుతో శాంతిదేవితో సరదాగా సంసారయాత్ర సాగిస్తున్నాడు.

ఎన్నడు తలవని తలంపు ఒకటి శాంతిదేవి ఆలోచన లలో ప్రవేశించి మెరిసింది. మధుకు తన పినతండ్రి కుమారుడు తమ్ముడు అయిన రాజేంద్రబాబు కుమార్తె చిరంజీవి రాధను ఇచ్చి వివాహము చేస్తే బాగుంటుంది అనుకుంది. కాని రమేశబాబు అప్పుడే వివాహానికి ఒప్పుకోడేమో అన్న భయం కలిగింది. అయినా చెప్పిచూడడం తన విధిగదా ! రమేశబాబు తన మందిరానికి 'కల్యాణీనివాస్' అని పేరు మార్చేడు. మధు యొక్క మంచితనము, అతని అదృష్టము తండ్రిని చేరుకోవడం, కేశవరావు త్యాగానికి పరిహారంగా పణము ఇవ్వడం మొదలైన సంఘటనలు నేర్పుగా జరిగాయి. ఈ నాడు మధుబాబు అనేక లక్షల అధికారి. తండ్రి ఆతని యిచ్ఛ వచ్చినట్లుగా ఎట్టి ఆటంకములు కలుగచేయక మధుని చూసుకుంటూ ఆనంద ప్రవాహంలో తేలిపోతున్నాడు. అతనికి ఆ వయసులో కావల సిన ఇంక ఏముంది. ఒక ప్రక్క మానవసేవ చేసుకుంటూ, ఆసుపత్రిలో పగలంతా కాలంగడపడం, తరువాత ఇంటిదగ్గర తన పుత్రునితో కాలక్షేపం చేయడంతో రమేశబాబుకు

పూర్తిగా మానసికానందం, తృప్తి కలిగాయి.

మధు అయిదు సంవత్సరములు ఇంజనీరింగు పూర్తి చేసి యూనివర్శిటీలో తన క్లాసుకు ఫస్టుక్లాసులో ప్యాసు అయ్యాడు. మద్రాస్‌లోనే ఇంజనీరుగాకూడా గవర్నమెంటు వారిచేత నియమించబడ్డాడు. గోపీకికూడా మంచిసంబంధము వచ్చిందని, నిశ్చయం చేసానని కేశవరావు మేనల్లునికి వ్రాసాడు. గోపీ వివాహానికి రమేశబాబు కుటుంబముతో వెళ్ళి గోపీకి బహుమానముగా మధు కోరికపై ఐదువే॥ రూపా యలు చదివించాడు. అందరూ ఆ మధుబాబుయొక్క అదృ ష్టాన్ని వేనోళ్ళ పొగిడారు.

రోజులు ఎప్పుడూ ఒకే మాదిరిగా వుండవుగదా ! మంచి ముహూర్తాన శాంతిదేవి తన మేనకోడలు చిరంజీవి రాధాదేవిని, చిరంజీవి మదనగోపాల్‌కు ఇచ్చి 'కల్యాణీ నివాస్‌లో' ను పద్మనివాస్‌లోను వివాహము ఎంతో వైభ వముగా జరిపించారు. పెళ్ళికి కేశవరావు సరోజలు, గోపీ సత్య వతులు వచ్చారు. వివాహసమయమున కేశవరావు, గోపీలు ఇద్దరు కలసి మేనల్లునికి పట్టు వస్త్రాలు, అయిదువందల రూపాయలు బహుమానముగా చదివించారు. వారందరూ సుఖంగా వుంటూవుంటే ఒక చిన్న గమ్మత్తు జరిగింది. పది నెలల తరువాత శాంతిదేవి మనుమరాలైన 'కల్యాణీ' బాలను ఎత్తుకుని ముద్దులాడుతుంటే రమేశబాబు వచ్చి తానుకూడా ఆనందంలో పాలు పంచుకున్నాడు. అదే సమయానికి మధు, రాధలు కిలకిలా నవ్వుకుంటూ పాపాయికి అప్పుడే కొని తీసుకువచ్చిన బొమ్మలు పట్టుచొక్కాలు తొడగమని అందిం

చాయ శాంతిదేవికి. అంతకంటే ఆ కుటుంబానికి మరేమి కావాలి. అంతా భగవంతుని చిద్విలాసమే కదా ! కాని విధి వైపరీత్యము వలన మనము అప్పుడప్పుడు అనేక బాధలకు గురిఅవుతాము. తిరిగి ఆ విధి బలీయము వల్లనే అన్ని కష్టాలు గడచి సాగరగర్భంలో వుండే నవరత్నాలు, నత్త గుల్లలు మాదిరిగా కలుసుకుంటూ వుంటాము. ఈ సంసార యాత్రా సాగరంలో మనమందరమూ, పడి లేచే కెరటాలమై విహరించుతూ ఆటూపోటులకు ఆడుకుంటూ క్రింద పడుతూ లేస్తూ వుంటాము అదే విధిబలీయము కదా !.

సంపూర్ణము.